| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు |
|---|---|---|---|---|---|---|
| **20.4.18** | శుక్ర | శు॥ పంచమి | మృగశిర | కర్కాటకం | మ. 12-04 | సామాన్య కార్యములు |
| **20.4.18** | శుక్ర | శు॥ పంచమి | మృగశిర | వృశ్చికం | రా. 08-39 | శుభాదులు |
| **21.4.18** | శని | శు॥ సప్తమి | పునర్వసు | కుంభం | రా.తె. 3-33 | గృహారంభం, గృహప్రవేశం. |
| **21.4.18** | శని | శు॥ సప్తమి | పునర్వసు | మీనం | రా.తె. 4-15 | గృహారంభం, గృహప్రవేశం. |
| **22.4.18** | ఆది | శు॥ సప్తమి | పునర్వసు | కర్కాటకం | ఉ. 11-55 | శుభాదులు |
| **25.4.18** | బుధ | శు॥ దశమి | మఘ | వృషభం | ఉ. 07-57 | శుభాదులు |
| **25.4.18** | బుధ | శు॥ ఏకాదశి | మఘ | కర్కాటకం | ఉ. 11-44 | శుభాదులు |
| **26.4.18** | గురు | శు॥ ద్వాదశి | ఉత్తర | వృశ్చికం | రా. 08-14 | శుభాదులు |
| **26.4.18** | గురు | శు॥ ద్వాదశి | ఉత్తర | మకరం | రా. 12-55 | శుభాదులు |
| **26.4.18** | గురు | శు॥ ద్వాదశి | ఉత్తర | కుంభం | రా.తె. 3-13 | శుభాదులు |
| **26.4.18** | గురు | శు॥ ద్వాదశి | ఉత్తర | మీనం | రా.తె. 3-55 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **27.4.18** | శుక్ర | శు॥ ద్వాదశి | ఉత్తర | వృషభం | ఉ. 07-49 | శుభాదులు |
| **27.4.18** | శుక్ర | శు॥ త్రయోదశి | ఉత్తర | కర్కాటకం | ఉ. 11-36 | శుభాదులు |
| **27.4.18** | శుక్ర | శు॥ త్రయోదశి | హస్త | వృశ్చికం | రా. 08-11 | శుభాదులు |
| **27.4.18** | శుక్ర | శు॥ త్రయోదశి | హస్త | మకరం | రా. 12-52 | శుభాదులు |
| **27.4.18** | శుక్ర | శు॥ త్రయోదశి | హస్త | మీనం | రా.తె. 3-52 | వివాహం, శుభాదులు |
| **28.4.18** | శని | శు॥ చతుర్దశి | హస్త | వృషభం | ఉ. 07-44 | శుభాదులు |
| **28.4.18** | శని | శు॥ చతుర్దశి | చిత్త | మకరం | రా. 12-47 | శుభాదులు |
| **28.4.18** | శని | శు॥ చతుర్దశి | చిత్త | కుంభం | రా.తె. 3-05 | వివాహం, శుభాదులు |
| **28.4.18** | శని | శు॥ చతుర్దశి | చిత్త | మీనం | రా.తె. 3-47 | శుభాదులు |
| **29.4.18** | ఆది | శు॥ పౌర్ణిమ | చిత్త | వృషభం | ఉ. 07-41 | శుభాదులు |
| **29.4.18** | ఆది | శు॥ పౌర్ణిమ | చిత్త | కర్కాటకం | ఉ. 11-28 | శుభాదులు |
| **29.4.18** | ఆది | శు॥ పౌర్ణిమ | స్వాతి | మకరం | రా. 12-44 | శుభాదులు |
| **29.4.18** | ఆది | శు॥ పౌర్ణిమ | స్వాతి | కుంభం | రా.తె. 3-02 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **29.4.18** | ఆది | శు॥ పౌర్ణిమ | స్వాతి | మీనం | రా.తె. 3-44 | శుభాదులు |

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు |
|---|---|---|---|---|---|---|
| **02.5.18** | బుధ | బ॥ విదియ | అనూరాధ | వృషభం | ఉ. 07-28 | శుభాదులు |
| **03.5.18** | గురు | బ॥ చవితి | మూల | కుంభం | రా. 02-45 | వివాహం, శుభాదులు |
| **03.5.18** | గురు | బ॥ చవితి | మూల | మీనం | రా.తె. 3-27 | శుభాదులు |
| **05.5.18** | శని | బ॥ షష్ఠి | ఉత్తరాషాఢ | కుంభం | రా. 02-37 | వివాహం, శుభాదులు |
| **05.5.18** | శని | బ॥ షష్ఠి | ఉత్తరాషాఢ | మీనం | రా.తె. 3-19 | శుభాదులు |
| **06.5.18** | ఆది | బ॥ షష్ఠి | ఉత్తరాషాఢ | వృషభం | ఉ. 07-13 | శుభాదులు |
| **06.5.18** | ఆది | బ॥ సప్తమి | ఉత్తరాషాఢ | వృశ్చికం | రా. 07-35 | శుభాదులు |
| **06.5.18** | ఆది | బ॥ సప్తమి | ఉత్తరాషాఢ | కుంభం | రా. 02-34 | వివాహం, గృహప్రవేశం. |
| **06.5.18** | ఆది | బ॥ సప్తమి | ఉత్తరాషాఢ | మీనం | రా.తె. 3-16 | శుభాదులు |
| **07.5.18** | సోమ | బ॥ సప్తమి | శ్రవణం | వృషభం | ఉ. 07-09 | శుభాదులు |
| **09.5.18** | బుధ | బ॥ నవమి | ధనిష్ఠ | వృషభం | ఉ. 07-01 | శుభాదులు |
| **09.5.18** | బుధ | బ॥ దశమి | శతతార | కుంభం | రా. 02-22 | శుభాదులు |
| **09.5.18** | బుధ | బ॥ దశమి | శతతార | మీనం | రా.తె. 3-04 | శుభాదులు |
| **అధిక జ్యేష్ఠ మాసం 16-05-2018 బుధ నుండి 13-06-2018 బుధ వరకు** | | | | | | |
| **నిజ జ్యేష్ఠ మాసం 14-06-2018 గురు నుండి 13-07-2018 శుక్ర వరకు** | | | | | | |
| **15.6.18** | శుక్ర | శు॥ విదియ | పునర్వసు | సింహం | ఉ. 11-34 | శుభాదులు |
| **15.6.18** | శుక్ర | శు॥ తదియ | పునర్వసు | కుంభం | రా. 11-57 | శుభాదులు |
| **15.6.18** | శుక్ర | శు॥ తదియ | పునర్వసు | మీనం | రా. 12-39 | శుభాదులు |
| **15.6.18** | శుక్ర | శు॥ తదియ | పునర్వసు | మేషం | రా.తె. 3-06 | శుభాదులు |
| **15.6.18** | శుక్ర | శు॥ తదియ | పునర్వసు | వృషభం | రా.తె. 4-33 | శుభాదులు |
| **16.6.18** | శని | శు॥ తదియ | పుష్యమి | సింహం | ఉ. 11-30 | శుభాదులు |
| **18.6.18** | సోమ | శు॥ షష్ఠి | మఖ | సింహం | ఉ. 11-22 | శుభాదులు |
| **20.6.18** | బుధ | శు॥ అష్టమి | ఉత్తర | సింహం | ఉ. 11-14 | శుభాదులు |

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు |
|---|---|---|---|---|---|---|
| **20.6.18** | బుధ | శు॥ అష్టమి | ఉత్తర | కుంభం | రా. 11-37 | శుభాదులు |
| **20.6.18** | బుధ | శు॥ అష్టమి | ఉత్తర | మీనం | రా. 12-19 | శుభాదులు |
| **20.6.18** | బుధ | శు॥ అష్టమి | హస్త | మేషం | రా. 02-46 | శుభాదులు |
| **20.6.18** | బుధ | శు॥ నవమి | హస్త | వృషభం | రా.తె. 4-13 | శుభాదులు |
| **21.6.18** | గురు | శు॥ నవమి | హస్త | కుంభం | రా. 11-33 | శుభాదులు |
| **21.6.18** | గురు | శు॥ నవమి | హస్త | మీనం | రా. 12-15 | శుభాదులు |
| **21.6.18** | గురు | శు॥ నవమి | చిత్త | మేషం | రా. 02-42 | శుభాదులు |
| **21.6.18** | గురు | శు॥ దశమి | చిత్త | వృషభం | రా.తె. 4-09 | శుభాదులు |
| **22.6.18** | శుక్ర | శు॥ దశమి | చిత్త | కుంభం | రా. 11-29 | శుభాదులు |
| **22.6.18** | శుక్ర | శు॥ దశమి | చిత్త | మీనం | రా. 12-11 | శుభాదులు |
| **22.6.18** | శుక్ర | శు॥ దశమి | స్వాతి | మేషం | రా. 02-38 | శుభాదులు |
| **22.6.18** | శుక్ర | శు॥ ఏకాదశి | స్వాతి | వృషభం | రా.తె. 4-05 | శుభాదులు |
| **23.6.18** | శని | శు॥ ఏకాదశి | స్వాతి | మీనం | రా. 12-07 | శుభాదులు |
| **27.6.18** | బుధ | శు॥ పౌర్ణిమ | మూల | సింహం | ఉ. 10-46 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ |
| **27.6.18** | బుధ | శు॥ పౌర్ణిమ | మూల | మీనం | రా. 11-51 | శుభాదులు |
| **27.6.18** | బుధ | శు॥ పౌర్ణిమ | మూల | మేషం | రా. 02-18 | శుభాదులు |
| **27.6.18** | బుధ | శు॥ పౌర్ణిమ | మూల | వృషభం | రా.తె. 3-45 | శుభాదులు |
| **29.6.18** | శుక్ర | బ॥ విదియ | ఉత్తరాషాఢ | కుంభం | రా. 11-02 | శుభాదులు |
| **29.6.18** | శుక్ర | బ॥ విదియ | ఉత్తరాషాఢ | మీనం | రా. 11-44 | శుభాదులు |
| **29.6.18** | శుక్ర | బ॥ విదియ | ఉత్తరాషాఢ | వృషభం | రా.తె. 3-38 | శుభాదులు |
| **30.6.18** | శని | బ॥ విదియ | ఉత్తరాషాఢ | సింహం | ఉ. 10-35 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ, ఉపనయనం. |
| **30.6.18** | శని | బ॥ తదియ | శ్రవణం | మేషం | రా. 02-07 | శుభాదులు |
| **01.7.18** | ఆది | బ॥ తదియ | శ్రవణం | సింహం | ఉ. 10-30 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ, ఉపనయనం. |
| **01.7.18** | ఆది | బ॥ చవితి | ధనిష్ఠ | మీనం | రా. 11-35 | శుభాదులు |
| **01.7.18** | ఆది | బ॥ చవితి | ధనిష్ఠ | మేషం | రా. 02-02 | శుభాదులు |
| **02.7.18** | సోమ | బ॥ చవితి | ధనిష్ఠ | సింహం | ఉ. 10-27 | గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ, ఉపనయనం. |
| **05.7.18** | గురు | బ॥ సప్తమి | ఉత్తరాభాద్ర | కుంభం | రా. 10-39 | శుభాదులు |

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు |
|---|---|---|---|---|---|---|
| **05.7.18** | గురు | బ॥ అష్టమి | ఉత్తరాభాద్ర | మేషం | రా. 01-48 | శుభాదులు |
| **05.7.18** | గురు | బ॥ అష్టమి | ఉత్తరాభాద్ర | వృషభం | రా.తె. 3-16 | శుభాదులు |
| **06.7.18** | శుక్ర | బ॥ అష్టమి | రేవతి | సింహం | ఉ. 10-12 | శుభాదులు |
| **06.7.18** | శుక్ర | బ॥ అష్టమి | రేవతి | కుంభం | రా. 10-35 | శుభాదులు |
| **06.7.18** | శుక్ర | బ॥ అష్టమి | రేవతి | మీనం | రా. 11-17 | శుభాదులు |
| **06.7.18** | శుక్ర | బ॥ నవమి | రేవతి | మేషం | రా. 01-44 | శుభాదులు |
| **06.7.18** | శుక్ర | బ॥ నవమి | రేవతి | వృషభం | రా.తె. 3-12 | శుభాదులు |
| **07.7.18** | శని | బ॥ నవమి | అశ్విని | సింహం | ఉ. 10-08 | శుభాదులు |
| **07.7.18** | శని | బ॥ నవమి | అశ్విని | కుంభం | రా. 10-31 | శుభాదులు |
| **07.7.18** | శని | బ॥ నవమి | అశ్విని | మీనం | రా. 11-13 | శుభాదులు |
| **07.7.18** | శని | బ॥ దశమి | అశ్విని | మేషం | రా. 01-40 | శుభాదులు |
| **07.7.18** | శని | బ॥ దశమి | అశ్విని | వృషభం | రా.తె. 3-07 | శుభాదులు |
| **ఆషాఢ మాసం 14-07-2018 శని నుండి 11-08-2018 శని వరకు** | | | | | | |
| **శ్రావణ మాసం 12-08-2018 ఆది నుండి 09-09-2018 ఆది వరకు** | | | | | | |
| **12.8.18** | ఆది | శు॥ విదియ | మఘ | కుంభం | రా. 08-13 | శుభాదులు |
| **12.8.18** | ఆది | శు॥ విదియ | మఘ | మీనం | రా. 08-55 | శుభాదులు |
| **13.8.18** | సోమ | శు॥ తదియ | ఉత్తర | మీనం | రా. 08-50 | శుభాదులు |
| **15.8.18** | బుధ | శు॥ పంచమి | హస్త | సింహం | ఉ. 07-36 | శుభాదులు |
| **15.8.18** | బుధ | శు॥ పంచమి | హస్త | కన్య | ఉ. 09-13 | శుభాదులు |
| **15.8.18** | బుధ | శు॥ పంచమి | చిత్త | కుంభం | రా. 08-01 | శుభాదులు |
| **15.8.18** | బుధ | శు॥ పంచమి | చిత్త | మీనం | రా. 08-43 | శుభాదులు |
| **15.8.18** | బుధ | శు॥ పంచమి | చిత్త | మేషం | రా. 11-09 | శుభాదులు |
| **16.8.18** | గురు | శు॥ షష్ఠి | చిత్త | సింహం | ఉ. 07-32 | శుభాదులు |
| **16.8.18** | గురు | శు॥ షష్ఠి | చిత్త | కన్య | ఉ. 09-09 | శుభాదులు |
| **16.8.18** | గురు | శు॥ షష్ఠి | చిత్త | తుల | మ. 12-02 | శుభాదులు |

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు |
|---|---|---|---|---|---|---|
| **16.8.18** | గురు | శు॥ షష్ఠి | స్వాతి | కుంభం | రా. 07-57 | శుభాదులు |
| **16.8.18** | గురు | శు॥ షష్ఠి | స్వాతి | మీనం | రా. 08-39 | శుభాదులు |
| **16.8.18** | గురు | శు॥ షష్ఠి | స్వాతి | వృషభం | రా. 12-33 | శుభాదులు |
| **17.8.18** | శుక్ర | శు॥ సప్తమి | స్వాతి | తుల | ఉ. 11-57 | సామాన్య కార్యములు |
| **19.8.18** | ఆది | శు॥ నవమి | అనూరాధ | కన్య | ఉ. 08-58 | శుభాదులు |
| **19.8.18** | ఆది | శు॥ నవమి | అనూరాధ | తుల | ఉ. 11-50 | శుభాదులు |
| **23.8.18** | గురు | శు॥ ద్వాదశి | ఉత్తరాషాఢ | కన్య | ఉ. 08-42 | శుభాదులు |
| **23.8.18** | గురు | శు॥ త్రయోదశి | ఉత్తరాషాఢ | తుల | ఉ. 11-34 | వివాహం, శుభాదులు |
| **23.8.18** | గురు | శు॥ త్రయోదశి | ఉత్తరాషాఢ | మీనం | రా. 08-11 | శుభాదులు |
| **23.8.18** | గురు | శు॥ త్రయోదశి | ఉత్తరాషాఢ | మేషం | రా. 10-38 | శుభాదులు |
| **23.8.18** | గురు | శు॥ త్రయోదశి | ఉత్తరాషాఢ | వృషభం | రా. 12-06 | శుభాదులు |
| **24.8.18** | శుక్ర | శు॥ చతుర్దశి | శ్రవణం | మీనం | రా. 08-07 | శుభాదులు |
| **24.8.18** | శుక్ర | శు॥ చతుర్దశి | శ్రవణం | మేషం | రా. 10-34 | శుభాదులు |
| **24.8.18** | శుక్ర | శు॥ చతుర్దశి | శ్రవణం | వృషభం | రా. 12-02 | శుభాదులు |
| **25.8.18** | శని | శు॥ చతుర్దశి | ధనిష్ఠ | తుల | ఉ. 11-26 | వివాహం, శుభాదులు |
| **25.8.18** | శని | శు॥ పౌర్ణిమ | ధనిష్ఠ | మీనం | రా. 08-03 | శుభాదులు |
| **25.8.18** | శని | శు॥ పౌర్ణిమ | ధనిష్ఠ | మేషం | రా. 10-30 | శుభాదులు |
| **25.8.18** | శని | శు॥ పౌర్ణిమ | ధనిష్ఠ | వృషభం | రా. 11-58 | శుభాదులు |
| **27.8.18** | సోమ | బ॥ పాడ్యమి | శతతార | కన్య | ఉ. 08-27 | శుభాదులు |
| **27.8.18** | సోమ | బ॥ పాడ్యమి | శతతార | తుల | ఉ. 11-19 | శుభాదులు |
| **29.8.18** | బుధ | బ॥ తదియ | ఉత్తరాభాద్ర | కన్య | ఉ. 08-19 | శుభాదులు |
| **29.8.18** | బుధ | బ॥ తదియ | ఉత్తరాభాద్ర | తుల | ఉ. 11-11 | వివాహం, శుభాదులు |
| **29.8.18** | బుధ | బ॥ తదియ | రేవతి | మీనం | రా. 07-48 | శుభాదులు |
| **29.8.18** | బుధ | బ॥ చవితి | రేవతి | మేషం | రా. 10-15 | శుభాదులు |
| **29.8.18** | బుధ | బ॥ చవితి | రేవతి | వృషభం | రా. 11-43 | శుభాదులు |
| **30.8.18** | గురు | బ॥ చవితి | రేవతి | తుల | ఉ. 11-07 | వివాహం, శుభాదులు |
| **30.8.18** | గురు | బ॥ చవితి | రేవతి | మీనం | రా. 07-44 | శుభాదులు |

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు |
|---|---|---|---|---|---|---|
| **30.8.18** | గురు | బ॥ పంచమి | అశ్విని | మేషం | రా. 10-11 | శుభాదులు |
| **30.8.18** | గురు | బ॥ పంచమి | అశ్విని | వృషభం | రా. 11-39 | శుభాదులు |
| **31.8.18** | శుక్ర | బ॥ పంచమి | అశ్విని | కన్య | ఉ. 08-10 | శుభాదులు |
| **31.8.18** | శుక్ర | బ॥ పంచమి | అశ్విని | తుల | ఉ. 11-02 | శుభాదులు |
| **31.8.18** | శుక్ర | బ॥ పంచమి | అశ్విని | మీనం | రా. 07-39 | శుభాదులు |
| **02.9.18** | ఆది | బ॥ సప్తమి | రోహిణి | మేషం | రా. 09-58 | శుభాదులు |
| **భాద్రపద మాసం 10-09-2018 సోమ నుండి 09-10-2018 మంగళ వరకు** | | | | | | |
| **ఆశ్వీయుజ మాసం 10-10-2018 బుధ నుండి 07-11-2018 బుధ వరకు** | | | | | | |
| **10.10.18** | బుధ | శు॥ విదియ | చిత్త | తుల | ఉ. 08-24 | శుభాదులు |
| **10.10.18** | బుధ | శు॥ విదియ | చిత్త | వృశ్చికం | ఉ. 09-20 | శుభాదులు |
| **10.10.18** | బుధ | శు॥ విదియ | స్వాతి | మేషం | రా. 07-27 | శుభాదులు |
| **11.10.18** | గురు | శు॥ తదియ | స్వాతి | తుల | ఉ. 08-19 | శుభాదులు |
| **12.10.18** | శుక్ర | శు॥ చవితి | అనూరాధ | వృషభం | రా. 08-47 | శుభాదులు |
| **12.10.18** | శుక్ర | శు॥ చవితి | అనూరాధ | సింహం | రా.తె. 3-44 | శుభాదులు |
| **13.10.18** | శని | శు॥ పంచమి | అనూరాధ | వృశ్చికం | ఉ. 09-08 | శుభాదులు |
| **14.10.18** | ఆది | శు॥ షష్ఠి | మూల | మేషం | రా. 07-11 | శుభాదులు |
| **14.10.18** | ఆది | శు॥ షష్ఠి | మూల | వృషభం | రా. 08-39 | శుభాదులు |
| **14.10.18** | ఆది | శు॥ షష్ఠి | మూల | సింహం | రా.తె. 3-36 | శుభాదులు |
| **15.10.18** | సోమ | శు॥ సప్తమి | మూల | తుల | ఉ. 08-04 | శుభాదులు |
| **15.10.18** | సోమ | శు॥ సప్తమి | మూల | వృశ్చికం | ఉ. 09-00 | శుభాదులు |
| **17.10.18** | బుధ | శు॥ అష్టమి | ఉత్తరాషాఢ | తుల | ఉ. 07-57 | శుభాదులు |
| **17.10.18** | బుధ | శు॥ అష్టమి | ఉత్తరాషాఢ | వృశ్చికం | ఉ. 08-53 | శుభాదులు |
| **17.10.18** | బుధ | శు॥ నవమి | ఉత్తరాషాఢ | వృషభం | రా. 08-28 | శుభాదులు |
| **17.10.18** | బుధ | శు॥ నవమి | శ్రవణం | కన్య | రా.తె. 5-00 | శుభాదులు |
| **18.10.18** | గురు | శు॥ నవమి | శ్రవణం | వృశ్చికం | ఉ. 08-48 | శుభాదులు |
| **18.10.18** | గురు | శు॥ దశమి | శ్రవణం | వృషభం | రా. 08-24 | శుభాదులు |
| **18.10.18** | గురు | శు॥ దశమి | ధనిష్ఠ | సింహం | రా.తె. 3-20 | శుభాదులు |
| **19.10.18** | శుక్ర | శు॥ ఏకాదశి | ధనిష్ఠ | వృషభం | రా. 08-20 | శుభాదులు |
| **19.10.18** | శుక్ర | శు॥ ఏకాదశి | ధనిష్ఠ | కన్య | రా.తె. 4-52 | శుభాదులు |

**20-10-2018 నుండి 01-11-2018 వరకు శుక్రమౌఢ్యమి.**

## కార్తీక మాసం 08-11-2018 గురు నుండి 07-12-2018 శుక్ర వరకు

**12-11-2018 నుండి 10-12-2018 వరకు గురుమౌఢ్యమి.**

## మార్గశిర మాసం 08-12-2018 శని నుండి 06-01-2019 ఆది వరకు

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు |
|---|---|---|---|---|---|---|
| **12.12.18** | బుధ | శు॥ షష్ఠి | ధనిష్ఠ | కన్య | రా. 01-21 | వివాహం, గృహప్రవేశం |
| **12.12.18** | బుధ | శు॥ షష్ఠి | ధనిష్ఠ | తుల | రా.తె. 4-13 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం |
| **13.12.18** | గురు | శు॥ షష్ఠి | శతతార | కన్య | రా. 01-17 | వివాహం, గృహప్రవేశం |
| **15.12.18** | శని | శు॥ అష్టమి | ఉత్తరాభాద్ర | తుల | రా.తె. 4-01 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం |
| **16.12.18** | ఆది | శు॥ నవమి | ఉత్తరాభాద్ర | కన్య | రా. 01-04 | సామాన్య కార్యములు |
| **16.12.18** | ఆది | శు॥ నవమి | రేవతి | తుల | రా.తె. 3-56 | సామాన్య కార్యములు |
| **16.12.18** | ఆది | శు॥ నవమి | రేవతి | వృశ్చికం | రా.తె. 4-51 | సామాన్య కార్యములు |
| **17.12.18** | సోమ | శు॥ దశమి | రేవతి | మకరం | ఉ. 09-32 | శుభాదులు |
| **17.12.18** | సోమ | శు॥ దశమి | రేవతి | మీనం | మ. 12-33 | శుభాదులు |
| **21.12.18** | శుక్ర | శు॥ చతుర్దశి | రోహిణి | మీనం | మ. 12-18 | శుభాదులు |
| **21.12.18** | శుక్ర | శు॥ చతుర్దశి | రోహిణి | కన్య | రా. 12-44 | వివాహం, గృహప్రవేశం |
| **21.12.18** | శుక్ర | శు॥ పౌర్ణిమ | మృగశిర | తుల | రా.తె. 3-36 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం |
| **23.12.18** | ఆది | బ॥ విదియ | పునర్వసు | తుల | రా.తె. 3-28 | శుభాదులు |
| **23.12.18** | ఆది | బ॥ విదియ | పునర్వసు | వృశ్చికం | రా.తె. 4-23 | శుభాదులు |
| **26.12.18** | బుధ | బ॥ పంచమి | మఘ | తుల | రా.తె. 3-18 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం |
| **26.12.18** | బుధ | బ॥ పంచమి | మఘ | వృశ్చికం | రా.తె. 4-13 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం |
| **27.12.18** | గురు | బ॥ షష్ఠి | మఘ | మకరం | ఉ. 08-54 | శుభాదులు |
| **28.12.18** | శుక్ర | బ॥ సప్తమి | ఉత్తర | కర్కాటకం | రా. 07-32 | సామాన్య కార్యములు |

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు |
|---|---|---|---|---|---|---|
| **28.12.18** | శుక్ర | బ॥ సప్తమి | ఉత్తర | తుల | రా.తె. 3-10 | సామాన్య కార్యములు |
| **28.12.18** | శుక్ర | బ॥ అష్టమి | ఉత్తర | వృశ్చికం | రా.తె. 4-05 | సామాన్య కార్యములు |
| **29.12.18** | శని | బ॥ అష్టమి | హస్త | కర్కటకం | రా. 07-27 | సామాన్య కార్యములు |
| **29.12.18** | శని | బ॥ నవమి | హస్త | తుల | రా.తె. 3-05 | సామాన్య కార్యములు |
| **29.12.18** | శని | బ॥ నవమి | హస్త | వృశ్చికం | రా.తె. 4-00 | సామాన్య కార్యములు |
| **30.12.18** | ఆది | బ॥ నవమి | చిత్త | కర్కాటకం | రా. 07-24 | సామాన్య కార్యములు |
| **30.12.18** | ఆది | బ॥ దశమి | చిత్త | తుల | రా.తె. 3-02 | శుభాదులు |
| **30.12.18** | ఆది | బ॥ దశమి | చిత్త | వృశ్చికం | రా.తె. 3-57 | శుభాదులు |
| **పౌష్య మాసం 07-01-2019 సోమ నుండి 04-02-2019 సోమ వరకు** | | | | | | |
| **మాఘ మాసం 05-02-2019 మంగళ నుండి 06-03-2019 బుధ వరకు** | | | | | | |
| **06.2.19** | బుధ | శు॥ విదియ | ధనిష్ఠ | కుంభం | ఉ. 08-30 | వివాహం, ఉపనయనం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ |
| **06.2.19** | బుధ | శు॥ విదియ | శతతార | మీనం | ఉ. 09-14 | వివాహం, ప్రతిష్ఠ, శుభాదులు |
| **06.2.19** | బుధ | శు॥ విదియ | శతతార | వృశ్చికం | రా. 01-27 | వివాహం, గృహప్రవేశం |
| **07.2.19** | గురు | శు॥ తదియ | శతతార | కుంభం | ఉ. 08-26 | వివాహం, ఉపనయనం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ |
| **07.2.19** | గురు | శు॥ తదియ | శతతార | మీనం | ఉ. 09-10 | వివాహం, ప్రతిష్ఠ, శుభాదులు |
| **08.2.19** | శుక్ర | శు॥ చవితి | ఉత్తరాభాద్ర | వృశ్చికం | రా. 01-19 | వివాహం, గృహప్రవేశం |
| **09.2.19** | శని | శు॥ చవితి | ఉత్తరాభాద్ర | కుంభం | ఉ. 08-19 | సామన్య కార్యములు |
| **09.2.19** | శని | శు॥ చవితి | ఉత్తరాభాద్ర | మీనం | ఉ. 09-03 | వివాహం, ప్రతిష్ఠ, శుభాదులు |
| **09.2.19** | శని | శు॥ పంచమి | రేవతి | వృశ్చికం | రా. 01-16 | వివాహం, గృహప్రవేశం |
| **10.2.19** | ఆది | శు॥ పంచమి | రేవతి | మీనం | ఉ. 08-58 | వివాహం, ప్రతిష్ఠ, శుభాదులు |
| **10.2.19** | ఆది | శు॥ షష్ఠి | అశ్విని | వృశ్చికం | రా. 01-11 | వివాహం, గృహప్రవేశం |
| **11.2.19** | సోమ | శు॥ షష్ఠి | అశ్విని | కుంభం | ఉ. 08-10 | ఉపనయనం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ |
| **11.2.19** | సోమ | శు॥ షష్ఠి | అశ్విని | మీనం | ఉ. 08-54 | ప్రతిష్ఠ, శుభాదులు |
| **13.2.19** | బుధ | శు॥ నవమి | రోహిణి | వృశ్చికం | రా. 01-00 | సామన్య కార్యములు |
| **14.2.19** | గురు | శు॥ నవమి | రోహిణి | మీనం | ఉ. 08-40 | సామన్య కార్యములు |

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు |
|---|---|---|---|---|---|---|
| **14.2.19** | గురు | శు॥ దశమి | మృగశిర | వృశ్చికం | రా. 12-57 | సామన్య కార్యములు |
| **15.2.19** | శుక్ర | శు॥ దశమి | మృగశిర | మీనం | ఉ. 08-37 | వివాహం, ప్రతిష్ఠ, శుభాదులు |
| **16.2.19** | శని | శు॥ ద్వాదశి | పునర్వసు | వృశ్చికం | రా. 12-49 | శుభాదులు |
| **17.2.19** | ఆది | శు॥ త్రయోదశి | పునర్వసు | మీనం | ఉ. 08-29 | శుభాదులు |
| **21.2.19** | గురు | బ॥ విదియ | ఉత్తర | మీనం | ఉ. 08-14 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ, శుభాదులు |
| **21.2.19** | గురు | బ॥ తదియ | ఉత్తర | వృశ్చికం | రా. 12-31 | వివాహం, గృహప్రవేశం |
| **22.2.19** | శుక్ర | బ॥ తదియ | హస్త | మీనం | ఉ, 08-09 | వివాహం, ప్రతిష్ఠ, శుభాదులు |
| **22.2.19** | శుక్ర | బ॥ చవితి | చిత్త | వృశ్చికం | రా. 12-26 | వివాహం, గృహప్రవేశం |
| **23.2.19** | శని | బ॥ పంచమి | స్వాతి | వృశ్చికం | రా. 12-23 | వివాహం, గృహప్రవేశం |
| **24.2.19** | ఆది | బ॥ షష్ఠి | స్వాతి | మీనం | ఉ. 08-02 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ, |
| **28.2.19** | గురు | బ॥ దశమి | మూల | మీనం | ఉ. 07-45 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ, |
| **28.2.19** | గురు | బ॥ దశమి | మూల | వృశ్చికం | రా. 12-02 | వివాహం, గృహప్రవేశం |
| **02.3.19** | శని | బ॥ ద్వాదశి | ఉత్తరాషాఢ | వృషభం | ఉ. 11-33 | శుభాదులు |
| **03.3.19** | ఆది | బ॥ ద్వాదశి | ఉత్తరాషాఢ | మీనం | ఉ. 07-33 | శుభాదులు |
| **03.3.19** | ఆది | బ॥ ద్వాదశి | శ్రవణం | వృషభం | ఉ. 11-28 | శుభాదులు |

**ఫాల్గుణ మాసం 07-03-2019 గురు నుండి 05-04-2019 శుక్ర వరకు**

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు |
|---|---|---|---|---|---|---|
| **07.3.19** | గురు | శు॥ విదియ | ఉత్తరాభాద్ర | మకరం | రా.తె. 4-16 | శుభాదులు |
| **08.3.19** | శుక్ర | శు॥ విదియ | ఉత్తరాభాద్ర | వృషభం | ఉ. 11-08 | శుభాదులు |
| **08.3.19** | శుక్ర | శు॥ విదియ | రేవతి | వృశ్చికం | రా. 11-34 | వివాహం, గృహప్రవేశం |
| **08.3.19** | శుక్ర | శు॥ తదియ | రేవతి | మకరం | రా.తె. 4-12 | వివాహం, గృహప్రవేశం |
| **09.3.19** | శని | శు॥ తదియ | రేవతి | వృషభం | ఉ. 11-03 | శుభాదులు |
| **09.3.19** | శని | శు॥ తదియ | రేవతి | వృశ్చికం | రా. 11-25 | వివాహం, గృహప్రవేశం |
| **09.3.19** | శని | శు॥ చవితి | అశ్విని | మకరం | రా.తె. 4-07 | వివాహం, గృహప్రవేశం |
| **10.3.19** | ఆది | శు॥ చవితి | అశ్విని | మీనం | ఉ. 07-05 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ, శుభాదులు |
| **10.3.19** | ఆది | శు॥ చవితి | అశ్విని | వృషభం | ఉ. 11-00 | శుభాదులు |

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | వివరములు |
|---|---|---|---|---|---|---|
| **13.3.19** | బుధ | శు॥ సప్తమి | రోహిణి | మీనం | ఉ. 06-52 | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ, శుభాదులు |
| **13.3.19** | బుధ | శు॥ సప్తమి | రోహిణి | వృషభం | ఉ. 10-47 | శుభాదులు |
| **13.3.19** | బుధ | శు॥ సప్తమి | రోహిణి | మకరం | రా.తె. 3-51 | వివాహం, గృహప్రవేశం |
| **14.3.19** | గురు | శు॥ అష్టమి | మృగశిర | మీనం | ఉ. 06-49 | శుభాదులు |
| **14.3.19** | గురు | శు॥ నవమి | మృగశిర | మకరం | రా.తె. 3-48 | శుభాదులు |
| **16.3.19** | శని | శు॥ దశమి | పునర్వసు | వృషభం | ఉ. 10-36 | శుభాదులు |
| **16.3.19** | శని | శు॥ దశమి | పునర్వసు | వృశ్చికం | రా. 10-56 | శుభాదులు |
| **16.3.19** | శని | శు॥ ఏకాదశి | పుష్యమి | మకరం | రా.తె. 3-37 | శుభాదులు |
| **16.3.19** | శని | శు॥ ఏకాదశి | పుష్యమి | కుంభం | రా.తె. 5-54 | శుభాదులు |
| **20.3.19** | బుధ | శు॥ పౌర్ణిమ | ఉత్తర | మకరం | రా.తె. 3-21 | శుభాదులు |
| **20.3.19** | బుధ | శు॥ పౌర్ణిమ | ఉత్తర | కుంభం | రా.తె. 5-38 | శుభాదులు |
| **21.3.19** | గురు | బ॥ పాడ్యమి | హస్త | మకరం | రా.తె. 3-17 | శుభాదులు |
| **21.3.19** | గురు | బ॥ పాడ్యమి | హస్త | కుంభం | రా.తె. 5-34 | శుభాదులు |
| **22.3.19** | శుక్ర | బ॥ తదియ | చిత్త | మకరం | రా.తె. 3-13 | శుభాదులు |
| **22.3.19** | శుక్ర | బ॥ తదియ | చిత్త | కుంభం | రా.తె. 5-30 | శుభాదులు |
| **23.3.19** | శని | బ॥ చవితి | స్వాతి | మకరం | రా.తె. 3-08 | శుభాదులు |
| **23.3.19** | శని | బ॥ చవితి | స్వాతి | కుంభం | రా.తె. 5-25 | శుభాదులు |
| **27.3.19** | బుధ | బ॥ సప్తమి | మూల | మేషం | ఉ. 08-23 | శుభాదులు |
| **27.3.19** | బుధ | బ॥ అష్టమి | మూల | మకరం | రా.తె. 2-52 | శుభాదులు |
| **27.3.19** | బుధ | బ॥ అష్టమి | మూల | కుంభం | రా.తె. 5-10 | శుభాదులు |
| **29.3.19** | శుక్ర | బ॥ దశమి | ఉత్తరాషాఢ | మకరం | రా. 02-44 | శుభాదులు |
| **29.3.19** | శుక్ర | బ॥ దశమి | ఉత్తరాషాఢ | కుంభం | రా.తె. 5-02 | శుభాదులు |
| **30.3.19** | శని | బ॥ దశమి | శ్రవణం | మకరం | రా. 02-40 | శుభాదులు |
| **30.3.19** | శని | బ॥ ఏకాదశి | శ్రవణం | కుంభం | రా.తె. 4-58 | శుభాదులు |
| **31.3.19** | ఆది | బ॥ ఏకాదశి | ధనిష్ఠ | మకరం | రా. 02-36 | శుభాదులు |
| **31.3.19** | ఆది | బ॥ ఏకాదశి | ధనిష్ఠ | కుంభం | రా.తె. 4-54 | శుభాదులు |

సర్వం శ్రీమాతృ చరణారవిందార్పణమస్తు    విద్వత్కృపాభిలాషి **దైవజ్ఞ లక్కావఝ్ఝుల సుబ్రహ్మణ్య సిద్ధాన్తి**



# మేష రాశి
## ARIES

ఆదాయం - 02
వ్యయం - 14
రాజ్యపూజ్యం - 05
అవమానం - 07

**అశ్వని, భరణి, కృత్తిక 1 వ పాదాలలో జన్మించినవారు.**
**చూ,చే,చో,ల,లీ,లూ,లే,లో,ఆ అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**మేష రాశి వారి లక్షణములు :**

వీరు సామాన్య శరీర ధారుడ్యం, పొడవైన మెడ, గుండ్రని యెర్రని కళ్ళు, హస్తములో పుట్టుమచ్చలాంటి చిహ్నాములు, కోల ముఖము కలిగి ఉంటారు. వేడి పదార్థములు భుజించుటయందు ఆసక్తి కలిగి అల్పాహారులై యుందురు. తీవ్రత, శక్తి, దృఢత్వం, అచంచలమైన నిశ్చయము, సాహసము, వ్యవహార దక్షత, విశ్లేషణ, నైపుణ్యత, స్వతంత్ర జీవనము నందు అభిలాష కలిగి, విద్యావంతులు, ఆరోగ్యవంతులు శౌర్యవంతులై ఉందురు. సాహసము ఆవశ్యకత ఉన్న చోట రాణింతురు. అభ్యాసము వలన శరీరశక్తి మరింత దృఢంగా ఉంటుంది. ముక్కుకు సూటిగా ఆవేశముగా ఎన్ని అడ్డంకులు వచ్చిననూ పోరాడి విజయం సాధింతురు. పదిమందిని కూడగట్టుకొని నాయకత్వం వహించుదురు. వేద శాస్త్ర సదాచారములయందు ప్రీతి కల్గి ఉందురు. నీరు,అగ్నిభయం ఎక్కువ. ప్రేమ, జాలి, దయా గుణములతో ఆకర్షించ గల నేర్పు కలిగి ఉంటారు. అహంకార పూరితమైన స్వభావము కారణంగా అపాయాలు,ఇబ్బందులు, కష్టాలు కొని తెచ్చుకుంటారు. కన్యారాశిలో జన్మించినవారు శత్రువులై వీరిని పొగిడి, రెచ్చగొట్టి పతనము చేయుదురు. బాల్యంలో కష్టాలు, చిన్న వయస్సులో ఆర్థిక ఇబ్బందులు, స్నేహితులను విడిచిపెట్టి, ఇతర ప్రాంతాలకు వెళ్ళడం, కుటుంబ పరిస్థితి మారడం జరుగును. దుడుకు స్వభావాన్ని వదిలి పెట్టలేరు. అతిస్నేహం, అతి శత్రుత్వం కలిగిన మనస్తత్వం వీరిని క్రుంగదీయును. ఏ చిన్న ఎదురు దెబ్బ తలిగినా నిరుత్సాహ పడే తత్వం. తండ్రియందు వ్యతిరేఖత తల్లి యందు అనురాగభావం, జ్యేష్ఠ సంతతి వలన కష్టములు, తోబుట్టిన వారి వలన సౌఖ్యమును కలిగి యుందురు. అబ్బాయిలు సౌందర్యం పట్ల, అలంకరణ పట్ల ఆసక్తి చూపుతారు. ప్రేమలో నూతనత్వాన్ని కాంక్షిస్తారు. కొత్త వ్యక్తి మీద ప్రేమ కలుగగానే పాతవారిని మరచిపోతారు. పొగడ్తలకు ఉబ్బి పోయెదరు. అశ్వినీ నక్షత్రమున జన్మించిన వారు అందముగా ఉందురు. అలంకార ప్రియులు. కార్యదక్షులు. భరణీ నక్షత్రం వారు సమర్థులు, సుఖవంతులు,మొండి పట్టు కలిగిన వారు. కృత్తికా నక్షత్రం వారు భోజన ప్రియులు, ఇతరుల విషయముల యందు ఆసక్తి కలవారు. తూర్పు, ఉత్తర సింహ ద్వారములు శుభప్రదం. 2,3,8,9,11లకు ఆది, మంగళ, బుధ, శనివారములు కలసిన శ్రేయోదాయకం.

### మేష రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 7,8 స్థానములలో, శని 9వ స్థానములో, రాహువు 4,3 స్థానములలో, కేతువు 10,9 స్థానములలో ఉండుట వలన

ధనవ్యయం అధికమగుట, రెండింతలు శ్రమ పడవలసివచ్చుట, చేయు వృత్తి వ్యాపారాదులయందు, కుటుంబ వ్యవహారములయందు ఏది మాట్లాడిననూ వివాదములు ఏర్పడుట, విద్యార్థులకు శ్రమకు తగిన ఫలితములు రాకపోవుట, సంవత్సర మధ్యమున నూతన వాహన కొనుగోళ్ళు చేయవలసి వచ్చుట, ఆర్థికపరంగా అనుకూలత లేకపోయిననూ శుభకార్యక్రమములను గృహనిర్మాణాది పనులను పూర్తిచేయుట, అధికారుల బెడద అధికమగుట, విద్యార్థులు దూరప్రాంతములకు వెళ్లవలసి వచ్చుట, ఆరోగ్యపరమైన లోపములు ఏర్పడుట, ఔషదసేవ చేయవలసి వచ్చుట, వాహనమార్పులు చేయుట, స్థానచలనములు జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు గణపతి హోమములు, దుర్గాద్వాత్రిశన్నామావళి, లక్ష్మీ హృదయ పారాయణములు, ఆకుపచ్చ వస్త్రములను దానముచేయుట, మారేడు వృక్షములకు నీళ్లుపోయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వ్యక్తులతో పరిచయములు ఏర్పడుట, నూతన కార్యక్రమములు ప్రారంభించుట, ధనలాభములు చేకూరుట, ఆరోగ్యపరమైన ఇబ్బందులు వాటిల్లుట, అధికారులను మన్నన చేసుకొని ఇష్టస్థానములకు స్థానచలనములు చేయించుకొనుట, ఆహారపరమైన ఇబ్బందులు వాటిల్లుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభమూలక ధనవ్యయము అధికమగుట, బంధువర్గంవారితో స్వల్పముగా మాటపట్టింపులు వచ్చుట, నూతన వస్తు ఆభరణాదులను కొనుగోలు చేయుట, శుభమూలక ధనవ్యయము అధికమగుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట, కుటుంబ వర్గం వారి వలన ధనవ్యయము అధికము అగుట, సేవాకార్యాక్రమాదులలో పాల్గొనుట, అధికారులతో స్వల్పముగా విభేదములు వచ్చుట, పూర్తిగాని పనులన్నియు ఒకేసారి నెత్తిమీద పడుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పనిభారము అధికమగుట, ప్రతిఒక్కరితో చికాకుతో కోపముగా వ్యవహారించుట, మిత్రుల, సహోద్యోగుల సహకారం తీసుకోవలసి వచ్చుట, ఏదోరకముగా ధనవ్యయము ఏర్పడుట, మాసాంతమున అధికారుల మన్ననలు పొందుట, స్థానమార్పిడిలు చేయవలసి వచ్చుట జరుగును.
**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం విందువినోదాలలో పాల్గొనుట, శుభ కార్యక్రమాలయందు శ్రమ అధికమగుట, తొందరపాటు తనము పెరుగుట, శుభమూలక ధనవ్యయము అధికమగుట, ఉద్యోగపరమైన సమస్యలు తగ్గుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు అయిష్టముగా పనులు చేయవలసివచ్చుట, సహోద్యోగులతో మాటపట్టింపులు వచ్చుట, ఇతరుల తప్పిదములకు అనవసరముగా జరిమానాలు చెల్లించవలసివచ్చుట, వాహన పరమైన ఇబ్బందులు తలెత్తుట, రక్తసందర్శనములు చేయుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మానసిక చాంచల్యము అధికమగుట, బంధుమిత్రులతో కలసి దూరప్రాంతములకు వెళ్లవలసి వచ్చుట, అకాల భోజనములు నిద్రలేమితనము వలన అనారోగ్యములు వాటిల్లుట, ఔషదసేవ చేయవలసి వచ్చుట, వాతావరణ మార్పుల ప్రభావము శారీరకముగా చూపించుట జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శ్వాస సంబంధమైన, హృదయ సంబంధమైన ఇబ్బందులు వాటిల్లుట, ఋణములు చేయవలసి వచ్చుట, ఆకస్మిక ప్రయాణములు అధిక ధనవ్యయము చేయవలసి వచ్చుట, మాసాంతమున అనుకోని ధనలాభములు ఏర్పడుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పొత్తు వ్యాపారాదులయందు పొత్తుదారుల తో మోసపోవలసి వచ్చుట, అనవసరంగా కాలయాపన చేయవలసివచ్చుట, ఆర్థిక ఇబ్బందులు అధికమగుట, ఏదోరకముగా ఖర్చులు పెరిగిపోవుట, రావలసిన బకాయిలు సమయానికి అందకపోవుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ వ్యక్తుల సహకారముతో సమస్యలు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, దైవ కార్యక్రమాదులలో పాల్గొనుట, దైవక్షేత్ర సందర్శనములు చేయుట, వినోద కార్యక్రమములకై కుటుంబ వ్యక్తులతో కలసి ప్రయాణములు చేయుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఇతరులు చేసిన తప్పిదములకు అనవసరముగా సంజాయిశీలు చెప్పుకోవలసి వచ్చుట, ఆరోగ్యపరమైన లోపములు స్వల్పంగా తగ్గుముఖం పట్టుట, విరోధములు మెల్లమెల్లగా సమసిపోవుట, నూతన ప్రయత్నములయందు లాభములు చేకూరుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆర్థికపరంగా ఒడిదుడుకులు ఏదోరకముగా సమసిపోవుట, నరములుకు సంబంధించిన అనారోగ్యము ప్రతినిత్యము బాధపెట్టుట, ఔషదసేవ చేయవలసి వచ్చుట, ఖర్చులను అదుపులో ఉంచుటకు ప్రయత్నములు సాగించుట, కుటుంబ వ్యక్తుల సహకారము తీసుకొనుట జరుగును.



# వృషభ రాశి
## TAURUS

| ఆదాయం - 11 |
|---|
| వ్యయం - 05 |
| రాజ్యపూజ్యం - 01 |
| అవమానం - 03 |

**కృత్తిక 2,3,4, రోహిణి 1,2,3,4, మృగశిర 1,2 పాదాలలో జన్మించినవారు.**

**ఇ,ఉ,ఏ,ఓ,వ,వి,వు,వే,వో అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**వృషభ రాశి వారి లక్షణములు :**

వీరిది పుష్టిగల శరీరం, గుండ్రని ముఖము, పొట్టి మెడ, తొడలు, పృష్ఠము విశాలముగా నుండును. ముఖము మీద గాని,వృష్ఠము మీదగాని,పార్శ్వ భాగమున గానీ పుట్టమచ్చ ఉండును.మూపురముండును.శరీరశిక్షణ, ఫుట్‌బాల్ వంటి ఆటలు ఆరోగ్యమును పెంచును. స్థిరత్వము, ఆనందము, వాత్సల్యము, దృఢత్వము, పెదవులపై చిరునవ్వు, నిజాయితీ, ఆప్యాయత, మంచి మనస్సు ఉండును. సంగీత సాహిత్యా భిలాషులు. వీరిలోని నిష్కల్మషమైన గుణము, మంచితనము, నమ్మకము కలిగించె స్వభావము ఎదుటివారిని ఆకర్షిస్తాయి. ఉన్నతాధికారులుగా నియమించినచో చక్కగా పనులు చేయింపగలరు. మధ్య వయస్సులోనూ, వృద్ధాప్యంలోనూ సుఖపడుదురు. ఎదుటివారిని ఆకర్షించగల శక్తిఎక్కువ. తండ్రిగానీ, తాతగానీ, అత్యంత ప్రతిభావంతులై ఉంటారు. పూర్వ బంధువులుందురు. వీరి వలన కుటుంబమునకు మంచిపేరు,ప్రతిష్ఠలు వస్తాయి. వ్యాపారంలో భాగస్వామ్యం పనికిరాదు.స్త్రీ ప్రియులు.ప్రేమ వ్యవహారాలలో చిక్కుకున్నచో, ఎదుటి వ్యక్తి చేతిలో కీలు బొమ్మ కాగలరు. ఒక యువతి చేత ఒకసారి ప్రభావితులైతే శక్తులన్నియూ వ్యర్థమై పోవును. చిన్న వయస్సులో వివాహమాడుట గానీ, ప్రేమ కలాపము గానీ, ఏదైనను మొదటి ప్రయత్నము విఫలమగును. 30ఏళ్ళ తర్వాత వివాహమాడినచో వైవాహిక జీవితం ఆనందమయమగును.ఈ రాశి స్త్రీలు బహు రూపవతులు. కళాత్మక దృష్టితో చిత్రములు, గృహోపకరణములు కంటికింపుగా ఏర్పాటు చేయుదురు.రుచిగల మధుర పదార్థములు తయారు చేయగలరు.విలాసముల కొరకు ఖర్చు చేయుదురు.పుత్రులు, పుత్రికలు కలిగి దీర్ఘాయుర్దాయము కలవారగుదురు. అబ్బాయిలకు-ప్రేమ వ్యవహారాల్లో నిజాయితీ కాస్తంత ఉధృతంగా ఉంటుంది. గుడ్డిగా ప్రేమిస్తారు.ప్రేమ,అభిమానాల విషయంలో ఎదురుదెబ్బ తగిలితే జీవితంలో కోలుకోలేరు. మనస్ఫూర్తిగా చేసే పొగడ్తలు అంటే ఇష్టం. కృత్తిక నక్షత్రం వారు భోజన ప్రియులు. తేజస్సు, ఇతరుల యందు ఆసక్తి కలిగి ప్రఖ్యాతి చెందుతారు. రోహిణి నక్షత్రము వారు స్థిరచిత్తులు, మధుర సత్యభాషణులు, శుచి కలిగి అందముగా నుందురు. మృగశిర నక్షత్రం వారు ఉత్సాహం, ధనము, భోగము కలిగి బాగా మాట్లాడుదురు. భయపడు స్వభావ ముండును.చపల చిత్తులు కానీ సమర్థులు. వీరి అదృష్ట సంఖ్య 1,2,5,6,9, శని, బుధ, శుక్ర, సోమవారములు కలసిన యోగించును.

### వృషభ రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 6,7 స్థానములలో, శని 8వ స్థానములో, రాహువు 3,2 స్థానములలో, కేతువు 9,8 స్థానములలో ఉండుట వలన

నూతన వ్యవహారముల యందు అభివృద్ధి ఏర్పడుట, శ్రమకు తగిన ఫలితము కలుగుట, చేయు వృత్తి వ్యాపారాదుల యందు ఉన్నత స్థానము కలుగుట, కళాకారులకు అభివృద్ధి ఏర్పడుట, విద్యావంతులకు గుర్తింపులు వచ్చుట, విద్యార్థులకు ఉన్నత విద్యకు అవకాశములు వచ్చుట, ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట, స్థిరాస్తి విషయములలో వివాదములు ఏర్పడుట, అధికారము నిలుపుకొనుటకు ధనము ఖర్చు చేయవలసి వచ్చుట, శుభకార్యక్రమ ప్రయత్నములు సఫలమగుట, దగ్గరి వారితో విభేదములు ఏర్పడుట, మీ పై ఇతరుల ఈర్ష్య అధికమగుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు సుందరాకాండ, మన్యుకల్ప పారాయణములు, అరటి పండ్లు, గంధం, తమలపాకులు, అన్నదానములు, కోతులకు ఆహారమందించుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన ప్రయత్నములు చేయుట, నూతన వ్యక్తులతో పరిచయములు ఏర్పడుట, ఆదాయము పెంపునకై ఆలోచనలు అధికము చేయుట, ఆకస్మికముగా కుటుంబ వ్యక్తులకు అనారోగ్యములు ఏర్పడుట, ధన నష్టములు ఏర్పడుట, ఆకస్మిక ప్రయాణములు చేయుట జరుగును.

**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులలో సన్నిహితుల సహకారముతో లాభములు ఏర్పడుట, ఆర్థికపరంగా అనుకూలత ఉన్ననూ, ఆరోగ్యపరంగా లోపములు ఏర్పడుట, ముఖ్యమైన కార్యక్రమాలకు అతిథిగా వెళ్లుట, విందువినోదాలలో వస్తువులను పోగోట్టుకొనుట, తిరిగి కష్టతరముతో సంపాందించుకొనుట జరుగును.

**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పనిభారము అధికమగుట, ప్రతిచిన్నపనిని ముందుండి నడిపించుట, కుటుంబ అభివృద్ధికై నూతన కార్యక్రమములు చేయుట, గౌరవమర్యాదలు పొందుట, ఉన్నతాధికారులతో కలసి ప్రయాణములు చేయుట, అనుకొని సంఘటనల వలన మానసిక అశాంతి ఏర్పడుట జరగును.

**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తి వ్యాపారములయందు అనుకూలముగా ఉన్ననూ గృహముయందు ఏదోరకమైన సమస్యతో ఇబ్బందిపడుట, ఇంటికంటే బయటయందే అధికముగా కాలముగడుపుట, మిత్రులతో కలసి పెట్టుబడి వ్యవహారములకై చర్చించుట, చాలాకాలంగా పూర్తికాని పనులను పూర్తి చేయుట జరుగును.

**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం గృహముయందు మార్పులు చేయుట, ఇతరుల గృహములయందు నివాసముండుట, ఆర్థికంగా రాబడియున్ననూ దానిని నిలుపుకోలేకపోవుట, దేవాలయ సందర్శనములు చేయుట, ఆడంబరముగా కనిపించాలని అనవసరపు ఖర్చులు చేయుట జరుగును.

**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ వ్యక్తులకు అనారోగ్య సమస్యలు మెల్లమెల్లగా తగ్గుట, రక్షకభటులతో మనస్పర్ధలు వచ్చుట, కోర్టు వ్యవహారములలో చిక్కుకొనుట, ఆస్తిపంపకముల విషయములో నెమ్మదితనము లేకపోవుట వలన సోదరవర్గం వారితో విభేదములు ఏర్పడుట జరుగును.

**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తివ్యాపారాదులయందు స్థానచలనములు ఏర్పడుట, ఉన్నతాధికారులతో మన్ననలు పొందుటకై అనేక రకములుగా ప్రయత్నములు చేయుట, అనుకున్నదానిలో కొంతవరకు అనుకూలత ఏర్పడి ఉన్నత అధికారములు వచ్చుట, చిరకాల మిత్రులను కలుసుకొనుట జరుగను.

**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వస్తువాహనాదులను కొనుగోలు చేయుట, దేవాలయాదులకు, ఆశ్రమాదులకు, సేవాసంస్థలకు తోచిన సహాయము అందించుట, మాసాంతమున ఇతరుల తప్పిదములకు మధ్యవర్తిత్వము చేసినందుకు మాటలుపడవలసి వచ్చుట జరుగును.

**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దైవ కార్యక్రమాదులలో పాల్గొనుట, శుభకార్యక్రమములు చేయుటకు కుటుంబ వ్యక్తుల సహకారము తీసుకొనుట, కోర్టు వ్యవహారములయందు విజయము చేకూరుట, స్థిరాస్తుల కొనుగోళ్ళు చేయుట, మాసాంతమున ఇతరుల గొడవలలో తలదూర్చుట జరుగును.

**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తివ్యాపారాదులలో అభివృద్ధి ఏర్పడుట, ఖర్చులు తగ్గించుకొని ధనము నిల్వచేయుట, పితృమూలక ధనము చేతికందుట, ప్రముఖులతో మన్ననలు పొందుట, వాహనములను మార్చుట మొండి బకాయిలు వసూలు చేసుకొనుట జరుగును.

**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభకార్యక్రమములు చేయుటయందు ప్రముఖ పాత్ర వహించుట, శుభమూలక ధనవ్యయములు అధికమగుట, ఆభరణములు కొనుగోలు చేయుట, బంధుమిత్రుల కలయికలు ఏర్పడుట, తూర్పు ఉత్తర ప్రాంతముల ప్రయాణములలో లాభములు చేకూరుట జరుగును.

**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సన్నిహితుల సహకారముతో పనులన్ని పూర్తిచేయుట, శారీరక శ్రమ అధికమగుట, ఖర్చు ఎంత తగ్గించుకున్ననూ అంతకంతా ఖర్చు అగుట, నూతన వ్యాపారాదులలో భాగస్వామ్యం ఏర్పరచుకొనుట, ప్రయాణముల యందు నిద్రలేమితనముతో అనారోగ్యము ఏర్పడుట జరుగును.



# మిథున రాశి

## GEMINI

ఆదాయం - 14
వ్యయం - 02
రాజ్యపూజ్యం - 04
అవమానం - 03

మృగశిర3,4, ఆర్ద్ర 1,2,3,4, పునర్వసు1,2,3, పాదాలలో జన్మించినవారు.
క,కి,కు,ఖం,జ్ఞ,చ,కే,కో,హ అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు

**మిథున రాశి వారి లక్షణములు :**

వీరికి మేధస్సు, జ్ఞాపకశక్తి, ప్రపంచ జ్ఞానమెక్కువ. ఎదుటివారిని క్షణాల్లో ఆకర్షిస్తారు. సందర్భాన్ని బట్టి మాట్లాడటంలో నేర్పు కలిగి ఉంటారు. కాలాన్ని, డబ్బును, వ్యక్తుల సామర్థ్యాలను చక్కగా వినియోగించగలరు. వీరు హాస్య ప్రియులు. జూద ప్రియులు. జ్యోతిష్య, కావ్య, గాన, నాట్య, కళా ప్రియులు. చాలా హాస్యముగాను, చమత్కారము గానూ మాట్లాడగలరు. దర్పంగా కనపడాలనే ఉద్దేశంతో అనవసర ఖర్చులు, ఆర్థిక ఇబ్బందులు తెచ్చుకుంటారు. వివాహంతో ధనంగాని, ఆస్తిగాని, ఉద్యోగ వ్యాపారాది లాభములు గానీ కలుగును. అసహనం, చికాకులు, విసుగు, అందర్ని క్రమశిక్షణలో వుంచుదామని నసపెట్టడం,ఈసడించుకోవడం,చులకనగా చూచుట,ఒత్తిడి చేయటం తగ్గించుకుంటే వీరి కుటుంబ సభ్యులు వీరి పట్ల ప్రేమగా వ్యవహరిస్తారు.వీరికి స్త్రీ లోలత్వము,స్త్రీల వలన అపకారం జరుగుతుంది.వార్తా ప్రసారము,విద్యా బోధనము, ఉపన్యాసములు, ఇతరుల సిద్ధాంతములను ప్రచారం చేయు గ్రంథముల రచనలందు అభిలాష కలిగి జీవితంలో రెండు రకాల వృత్తి ఉద్యోగాలలో ప్రావీణ్యత ఉంటుంది. వ్యాపార సంస్థలకు ప్రణాళికలను రూపొందించుట తెలియును.ఇష్టపడి చదివినసూ మధ్యలో నేర్చుకున్నదే జీవితంలో ఉపయోగపడుతుంది,ఆర్జించిన ధనం మాత్రం స్థిర చరాస్తులకు, గృహ క్షేత్రాదులకు సరిపోతుంది.ఆలోచించకుండా చేసే పనులలో విశేష ధనలాభం కలుగును.అబ్బాయిలు ఎప్పుడు ఆనందంగా వుండే వారంటే ఇష్టపడతారు.ప్రపంచంలోని అందాలన్నీ అందిస్తారు.తమ భావాలని అర్థం చేసుకునే, జాగ్రత్తగా చూసుకునే వారిని కోరుకుంటారు.అమ్మాయిలు–తెలివిగలవారు గనుక అందచందాలు చూసి కాక బహుముఖ ప్రజ్ఞాశాలై అన్ని విషయాలనూ చర్చించే వారిని ప్రేమిస్తారు. మృగశిరా నక్షత్రము వారు ఉత్సాహము, ధనము, భోగము కలిగి బాగా మాట్లాడుదురు. భయపడు స్వభావముండును. చపలచిత్తము కాని సమర్థులు.ఆర్ద్రా నక్షత్రమువారు పరకార్యములందు విముఖత్వము, గర్వము,కృతఙ్ఞత,హింసించు స్వభావము కలిగి పాప కార్యములు చేయుదురు.పునర్వసు నక్షత్రం వారు ఇంద్రియ నిగ్రహం కలిగి తపస్సు చేయుటయందు ఆసక్తి కలిగి యుందురు.సుఖ పడుదురు.సుశీలత్వముండి, అమాయకుని వలె కనిపించుదురు. ఆరోగ్యము తక్కువ, దాహము జాస్తి, అల్ప సంతోషులు. వీరి అదృష్ట సంఖ్య 1,3,6,9. ఆది, సోమ, బుధ వారములు కలిసివచ్చును.

### మిథున రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 5,6 స్థానములలో, శని 7వ స్థానములో, రాహువు 2,1 స్థానములలో, కేతువు 8,7 స్థానములలో ఉండుట వలన

శారీరక ఇబ్బందులు అధికమగుట, విలువైన వస్తువులు పోగొట్టుకొనుట, చొరబాధలు అధికమగుట, ఇతరుల తప్పిదములకు మాటలు పడవలసివచ్చుట, పుణ్యక్షేత్ర సందర్శనములు చేయుట, యాగములలో పాల్గొనుట, ఆదాయమునకు మించి ఖర్చులు ఉండుట, పనులయందు ఆసక్తి తగ్గుట, విద్యార్థులకు శ్రమతో గుర్తింపులు వచ్చుట, ప్రముఖులను కలుసుకొనుట, కళాకారులకు కీర్తి ప్రతిష్ఠలు పెరుగుట, వ్యాపారమందు లాభములు కలుగుట, ఉద్యోగులకు స్థానచలనములు ఏర్పడుట, స్థిరాస్తులను కొనుగోలు చేయుట, అధికారుల అనుకూలత లేకపోవుట, ఆకస్మిక వృధా ప్రయాణములు చేయుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు విష్ణు సహస్ర నామ పారాయణములు, విష్ణువుకు ప్రీతికరమైన పూజలు, తేనె, కర్పూరం, సాలగ్రామ, దేవతాప్రతిమల దానములు చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వ్యాపారాదులకై ఏర్పాట్లు చేసుకొనుట, ఉన్నత విద్యకై ఆటంకములు తొలగి అనుకూలత ఏర్పడుట, దైవ కార్యక్రమాదులలో పాల్గొనుట, ఉత్తర, తూర్పు ప్రయాణములు లాభించుట, ఉద్యోగాదుల యందు అభివృద్ధి వచ్చుట, మిత్రులను కలుసుకొనుట జరుగును.

**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట, శారీరక శ్రమ అధికమగుట, ఉదర సంబంధమైన ఇబ్బందులు వచ్చుట, ఆరోగ్య పరంగా జాగ్రత్తలు తీసుకోవలసి వచ్చుట, సోదరవర్గం వారితో కలసి విందువినోదాలలో పాల్గొనుట, నూతన వ్యాపారములు లాభించుట జరుగును.

**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులలో స్థానచలనములు ఏర్పడుట, కుటుంబపరంగా అనుకూలత ఏర్పడుట, సంతానము అభివృద్ధికై పనులు చేపట్టుట, అనారోగ్య సమస్యలు వెంటాడుట, దూరప్రయాణములు చేయుటకు ఇతరుల ప్రోత్సాహములు లభించుట, అన్నింటియందు విజయము చేకూరుట జరుగును.

**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రముఖుల మన్ననలు పొందుట, శుభ కార్యక్రమములు పూర్తి చేయుట, అధికారుల ఒత్తిడిలు అధికముగా ఉన్ననూ వాటన్నిటిని అధికమించుట, సంగీత, సాహిత్య కార్యక్రమాలలో పాల్గొనుట, శారీరక శ్రమ అధికమగుట, ఋణములు చేయవలసి వచ్చుట జరుగును.

**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అధికారుల ఒత్తిడితో ఆకస్మిక కోపోద్రిక్తములు అధికమగుట, అధికారమును చేపట్టుటకై అనేక రకములుగా ప్రయత్నములు చేసి సఫలీకృతమగుట, వస్తువాహనాదులను మార్పు చేయుట జరుగును.

**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఇతరుల ఆధిపత్యాన్ని సహించలేకపోవుట, ఋణములను చేయవలసి వచ్చుట, కోపముతో కుటుంబవ్యక్తులతో మనస్పర్ధలు తెచ్చుకొనుట, వైద్యుల సలహా తీసుకోవలసి వచ్చుట, అన్నింటియందు ముందుండాలనే తపనతో పనులన్ని నెత్తిమీద వేసుకొనుట జరుగును.

**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మాటపట్టింపులు ఉన్ననూ మెల్లమెల్లగా సమసిపోయి కుటుంబవ్యక్తులతో కలసి విందు వినోదాలలో పాల్గొనుట, ఆరోగ్యముపై శ్రద్ధ వహించకపోవుట, మాతృవర్గంవారితో సఖ్యతలేర్పడుట, దైవ కార్యక్రమాదులలో పాల్గొనుట, ఇతరులకు చెప్పే స్థానములో ఉండాలని అనుకొనుట జరుగును.

**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రముఖుల మన్ననలు పొందుట, సంఘముయందు గౌరవమర్యాదలు పెరుగుట, నూతన వ్యక్తులతో పరిచయములు ఏర్పడుట, ఇంటి వ్యక్తులతో సఖ్యత లేకపోవుట, ప్రయాణాదులతో కాలము వృధా చేయుట, అనవసరమైన ఖర్చులు చేయుట జరుగును.

**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వస్తువాహనాదులు కొనుగోలు చేయుట, వ్యాపార రంగముయందు మార్పులు చేయుట, ఇతరుల గొడవలలో మధ్యవర్తిత్వం చేసిన వ్యవహారములు సమసిపోవుట, కుటుంబ అభివృద్ధికై దైవ కార్యక్రమములు చేయుట, ఔషధసేవ చేయవలసి వచ్చుట జరుగును.

**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అధికారుల ఒత్తిడి అధికమగుట, సమయానికి పనులు చేయకపోవటం వలన మాటలు పడవలసి వచ్చుట, ఋణములు చేయుట, ఖర్చులు అధికమగుట, చాకచక్యముతో సమస్యలను అధికమించుట, తొందర పాటుతనముతో విభేదములు తెచ్చుకొనుట, శిరోబాధ అధికమగుట జరుగును.

**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఇతరుల ఒత్తిళ్ళు అధికముగా ఉన్ననూ పనులను సమర్ధవంతముగా పూర్తి చేయుట, అకాల భోజనములు నిద్రలేమి తనముతో అనారోగ్యములు వాటిల్లుట, ఔషదసేవ చేయవలసి వచ్చుట, సోదరవర్గం వారితో అనుకూలత ఏర్పడుట, శుభకార్యక్రమములకు హాజరగుట జరుగును.

**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తివ్యాపారాదులయందు నమ్మక ద్రోహములు అధికమగుట, దగ్గరి వారి వలన మోసపోవలసి వచ్చుట, మిత్రుల సహకారముకై ప్రయత్నములు చేయుట, ఎన్ని ఇబ్బందులు ఉన్ననూ పైకి మాత్రము తెలియనివ్వకపోవుట, దైవ అనుగ్రహమునకై ప్రాకులాడుట జరుగును.



# కర్కాటక రాశి
## CANCER

ఆదాయం - 08
వ్యయం - 02
రాజ్యపూజ్యం - 07
అవమానం - 03

**పునర్వసు 4, పుష్యమి 1,2,3,4, ఆశ్రేష 1,2,3,4 పాదాలలో జన్మించినవారు.**
**హి,హు,హే,హో,డ,డి,డు,డె,డో అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**కర్కాటకరాశి వారి లక్షణములు :**

ఎత్తైన జఘన ప్రదేశము. పొట్టితనము, కంఠము లావుగాను, గుండ్రని నవ్వు ముఖము, తెల్లటి శరీర కాంతి మధ్యమ శరీర ధారుఢ్యం కలిగియుందురు. వీరి జీవితం సుఖ సంతోషాల అదృష్టాల మిశ్రమం. విషయ విశ్లేషణ, అవగాహనలలో వీరికి శక్తి, ఏకాగ్రత ఎక్కువ. ఆలోచించి, చక్కటి నిర్ణయాలు తీసుకుంటారు. మిత్రుల విషయంలో, స్వజన బంధువుల విషయంలో, ఆత్మీయతతో, నమ్మకంగా మసలుకొంటారు. మర్యాదగా సంభాషించెదరు. కొంతమందితో స్నేహంగా ఉంటారు. సముద్రానికి గాని, నదికిగాని చేరువలో ఉండే ప్రదేశాలు కలసివస్తాయి. జలగండం ఉండును. ఒక్కొక్కసారి అకారణభీతి, ఒంటరితనము పట్ల అభిలాష, వివాదం, నిరాశ,దిగులు, బంధుమిత్ర బృందముతో కలిసి ఉండలేరు. వీరు వక్రముగానూ, శీఘ్రముగాను నడుస్తారు. వ్యవహారాలను అతి జాగ్రత్తగా సమర్థించుకోలేరు. యుక్తాయుక్త విచక్షణ ఎక్కువ. చదవటమన్నా, అధ్యయనం చేయుట అన్నా మక్కువ. జ్యోతిష్య, వైద్య, గణిత శాస్త్రముల యందు అభిరుచి ఎక్కువ. సరుకుల ఎగుమతి దిగుమతులు, ధాన్యం,వస్త్రములు, తినుబండారములు,పానీయముల వ్యాపారాలు కలిసివచ్చును. భాగస్వామ్య వ్యాపారాలలో మెలకువ అవసరము. ఉద్యోగం కన్నా వ్యాపారం లాభదాయకం. స్వతంత్ర నిర్ణయాలతో ప్రగతిని సాధిస్తారు. భూమి పేర్లతో చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. వృద్ధి క్షయములు గల ధనము కలిగియుందురు. 20 సం॥రాలలోపు ఆర్థిక ఇబ్బందులు ఎక్కువ. సరదాగా మాట్లాడిన మాటల వలన ఎక్కువగా నష్టపోతారు. నీటియందు పూలతోటయందు ఆసక్తి ఎక్కువ. చిన్న వయస్సులోనే వివాహం జరుగును. పిల్లలను విడిచి ఎక్కువకాలం ఉండలేరు. పిల్లల్ని అల్లరి పెడతారు. చిన్న మాటకే ఎక్కువగా నొచ్చుకుంటారు. త్వరగా మరచిపోకుండా పదేపదే తలుచుకుంటారు. పరస్త్రీలయందు మక్కువ ఎక్కువ. మంచిపేరు, ప్రతిష్టలతో ఉన్నత పదవిలో దూర దేశమున స్థిరపడును. పునర్వసు నక్షత్రమున జన్మించినవారు ఇంద్రియ నిగ్రహం, తపఃశక్తి, సౌఖ్యము, సుశీలత్వము అమాయకత్వం, అనారోగ్యము ఉండును. దాహము జాస్తి, అల్ప సంతోషము ఉండును. పుష్యమి వారు ఇంద్రియ నిగ్రహము, అందరియందు అనుకూలత, శాస్త్రార్థ జ్ఞానమును కలిగియుందురు. ధనవంతులు ధర్మాసక్తిపరులు అగుదురు.ఆశ్లేషవారు ఇతరుల పనులయందు విముఖత్వము కల్గియుందురు. సర్వభక్షకులై పాపకర్మలు చేయుదురు. చేసిన ఉపకారము మరచుదురు. ఇతరులను వంచన చేయుదురు. వీరి అదృష్ట సంఖ్య 2,3,6,9, సోమ, మంగళ, శుక్ర, ఆది వారములు కలిసిన మరింతమేలు.

### కర్కాటక రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 4,5 స్థానములలో, శని 6వ స్థానములో, రాహువు 1,12 స్థానములలో, కేతువు 7,6 స్థానములలో ఉండుట వలన

ప్రతిపని యందు ఇబ్బందులు అధికమగుట, వాహనములను, విలువైన వస్తువులను పోగొట్టుకొనుట, మానసిక ప్రశాంతత లేకపోవుట, చేయు ఉద్యోగాదులయందు మార్పు వచ్చుట, అధికారుల బెడద అధికమగుట, భార్యభర్తల మధ్య విభేదములు అధికమగుట, శుభకార్యక్రమ ప్రయత్నములు సఫలం కాకపోవుట, ఆర్థిక ఇబ్బందులు ఋణబాధలు అధికమగుట, సమయానికి పితృ, కళత్ర వర్గం వారి సహకారం లభించుట, నిర్మాణాది పనులు మధ్యలో ఆగిపోవుట, అనారోగ్య సమస్యలు వాటిల్లుట, స్థిరత్వం లేకపోవుట, మిత్రుల దగ్గర మాట నిలుపుకోలేకపోవుట, చెడ్డ పేరు వచ్చుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు గణపతి ఆరాధనలు, గణపతి హోమములు, వేద పండితులకు వెండిగణపతిని, అన్నదానమును చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం తొందరపాటు మాటల వలన మేలు చేసేవారితో విభేదములు వచ్చుట, ఆదాయం అనుకూలంగా ఉన్ననూ ఖర్చులు అధికమగుట, నూతన వస్తువాహన ఆభరణాదులు కొనుగోలు చేయుట జరుగును.

**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆదాయ వ్యయములు సమముగా ఉండుట, వివాహాది శుభకార్యక్రమములలో చురుకుగా పాల్గొనుట, వాహనపరమైన ఇబ్బందులు వచ్చుట, ఇతరుల పనులను నెత్తిమీద వేసుకొని అనవసరపు ఖర్చులు అధికము చేసుకొనుట, ఉద్యోగాదులయందు అభివృద్ధి కై ఇతరుల సహకారం తీసుకొనుట జరుగును.

**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దైవ కార్యక్రమాదులలో పాల్గొనుట, గృహనిర్మాణాదిపనులను సక్రమముగా పూర్తి చేయుటకు ధనము వెచ్చించుట, కుటుంబ వ్యక్తులతో కలసి విందువినోదాలలో పాల్గొనుట, తొందరపాటు నిర్ణయములతో కొంతమందితో మాటలుపడవలసి వచ్చుట జరుగును.

**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం తొందరపాటు నిర్ణయముల వలన ఖర్చులు అధికమగుట, అధికారులతో స్వల్ప విరోధములేర్పడుట, కార్యభారము అధికమగుట, ఇతరులను లెక్కచేయకపోవుట, కుటుంబ వ్యక్తులతో సఖ్యత సన్నగిల్లుట, నిలిచిపోయిన పనులను పూర్తి చేయుటకు అనేక విధములుగా ప్రయత్నించుట జరుగును.

**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు శ్రమకు తగిన ఫలితము కలుగుట, లాభములు పొందాలనే కోరికను నిజము చేసుకొనుటకు ఆరోగ్య సమస్యలు ఉన్ననూ అధికముగా శ్రమించుట, మిత్రులతో కలసి పెట్టుబడి వ్యాపారములు సాగించుట, ఆకస్మిక ప్రయాణములు చేయుట జరుగును.

**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు గడ్డు సమస్యలు తగ్గుముఖం పట్టుట, శుభమూలక ధనవ్యయములు అధికమగుట, నేత్ర సంబంధ ఇబ్బందులు వచ్చుట, బంధుమిత్రులను కలుసుకొనుట, ఇతరులు చేసిన తప్పిదాలకై అనవసరముగా మాటలు పడవలసి వచ్చుట జరుగును.

**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం గృహనిర్మాణాది పనులలో ఆటంకములు ఏర్పడుట, కొద్దిగా వస్తు, ధన నష్టము కలుగుట, వినోద కార్యక్రమాదులలో కీలకమైన వస్తువులను మరచిపోవుట, అతి కష్టము మీద దానిని తిరిగి పొందుట, సేవా కార్యక్రమాదులలో పాల్గొనుట, పేరు ప్రఖ్యాతలు పెరుగుటకై తహతహలాడుట జరుగును.

**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం గౌరవ మర్యాదలు పెరుగుట, ఆర్థికంగా అనుకూలంగా ఉన్ననూ పదిమందిలో హుందాగా కనబడాలనే ఆలోచనతో ఆడంబరముగా ధనమును ఖర్చు చేయుట, నరఘోష అధికమగుట, ప్రతిపనియందు ఏదోరకమైన ఆటంకములు వచ్చుట, అయిననూ వాటిని దిగ్విజయముగా పూర్తి చేయుట జరుగును.

**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం లాభములు చేకూరిననూ ఆశించినంత ఫలితములు రాకపోవుట వలన అసంతృప్తి అధికముగా ఉండుట, ఉత్తమ ఫలితములు అందుకోవాలని రాత్రిపగలు అధికముగా కష్టపడుట, అనారోగ్య సమస్యలు ఏర్పడుట, విద్యారంగముయందు అభివృద్ధి ఏర్పడుట, ఆకస్మిక ప్రయాణములు చేయుట జరుగును.

**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు ఉద్యోగాదులయందు ఉన్నత అధికారుల సూచనలు, సలహాలను తప్పక పాటించవలసి వచ్చుట, గౌరవ మర్యాదలు పొందుటకై ప్రయత్నములు చేయుట, తెలియని వ్యక్తుల వలన మోసపోవలసి వచ్చుట ప్రయాణములయందు వస్తునష్టములు వాటిల్లుట జరుగును.

**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం స్థిరచరాస్తుల యందు మాటపట్టింపులు వచ్చుట, సోదరవర్గం వారితో కలహములు ఏర్పడుట, పెట్టుబడికి తగిన మొత్తము రావాలని తాపత్రయముపడుట, దైవ సందర్శనములు చేయుట, శుభ కార్యక్రమములు సంపూర్ణము చేయుట, విలువైన వస్తువులను కొనుగోలు చేయుట జరుగును.

**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మిత్రులను కలుసుకొనుట, అంతర్గత వ్యవహారములు తొందరగా పూర్తిచేయుట, విశ్రాంతి లేకుండా శ్రమ చేయడము వలన అనారోగ్యములు ఏర్పడుట, సంఘముయందు గౌరవ మర్యాదలు పెరుగుట, ప్రతి కార్య క్రమముయందు విజయములు చేకూరుట జరుగును.



# సింహ రాశి

LEO

| ఆదాయం - 11 |
|---|
| వ్యయం - 11 |
| రాజ్యపూజ్యం - 03 |
| అవమానం - 06 |

మఖ 1,2,3,4, పుబ్బ 1,2,3,4, ఉత్తర 1వ పాదాలలో జన్మించినవారు.

మా,మి,ము,మే,మో,టా,టీ,టు,టే అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు

**సింహరాశి వారి లక్షణములు :**

చెక్కిళ్ళు వెడల్పుగాను, కపిల వర్ణమైన నేత్రములు, కోల ముఖము, ఎముక బలము కలిగి ఉందురు. వీరికి ధైర్యం, సాహసం, పరాక్రమం స్థిరమైన బుద్ధి, దూసుకుపోయే చొరవ కలిగి, ఎంతటి సమస్యనైనా విశ్లేషించి అవగాహన చేసుకొని నిర్ణయాలు తీసుకోగల శక్తి సామర్థ్యాలు, మేధస్సు, జ్ఞాపకశక్తి, ఆకర్షణ శక్తి కలిగి ఉంటారు. టెక్నికల్ విద్యయందు అభిరుచి ఉండును. జీవితంలో ఎలాంటి క్లిష్ట పరిస్థితిలోనైనా ఎదుర్కోగలరు. రాశి చిహ్నమైన సింహానికి తగినట్లే వీరి ప్రవర్తన ఉంటుంది.నిష్కారణంగా కోపం తెచ్చుకుంటారు. క్రమశిక్షణ, ఆరోగ్యానికి, వ్యక్తిగత ప్రతిష్టకు ప్రాధాన్యత ఇస్తారు. గర్వం, ఆకలి దప్పులు ఎక్కువ. వీరు మౌన ప్రియులు. మానసిక, ఉదర, దంతముల బాధలు కలుగుచుండును. ఎదుటి వారిని మెప్పించగల వాక్చాతుర్యంతో పదిమందిని ఆకర్షించి, వారిని శాసించి, చెప్పుచేతలలో నుంచుకొని తూచా తప్పకుండా వీరి అభిప్రాయాలను ఆచరించేలా చేయగల నాయకత్వ లక్షణాలు కలిగి ఉంటారు. స్వతహాగా ఎప్పుడూ కులాసాగా, ఉల్లాసంగా, హాస్యంగా ఉండే వీరు కొన్ని సందర్భాలలో ఒక్కసారి మాటలతో ఎదుటివారిని ఆదేశించగల కాఠిన్యం ఓడించగల నేర్పు ఉంటుంది. ఇతరుల బాధ్యతలు నెత్తిన వేసుకొని బాధపడుచుందురు. జీవనోపాధి మార్గములో దెబ్బలు తినుట, ఇతరులను భయపెట్టుట, పీడించుట వీరికి అలవాటు. అధికారులతో పొత్తు కుదురదు. ఇట్టివారు సామాన్యంగా చిన్నతనం నుండి తండ్రితోగానీ, జ్యేష్ఠ పుత్రునితోగాని విరోదం పెట్టుకొని విడిపోదురు. భారీ ఎత్తున వ్యాపార సంస్థలు నిర్వహింపగలరు. స్నేహమంటే ప్రాణమిచ్చే సన్నిహితులు, స్నేహితులు ఎక్కువ. కష్టాలలో ఉన్నవారికి చేయూతనిస్తారు. త్యాగ గుణములను, కళలలోనూ, నటనలో బాగా రాణిస్తారు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. ఆహార విషయంలో నియంత్రణ చూపవలెను. బంధువుల వలన పరస్త్రీల వలన నష్టం కలుగుతుంది. స్త్రీల యందు మంచి ఇష్టత ఉంటుంది. స్త్రీలు తమ తల్లిదండ్రులకు భర్తకు తెలియని విషయములు చెప్పుదురు. అబ్బాయిలు ప్రేమ విషయంలో తొందరపాటు నిర్ణయాలు చేస్తారు. ప్రేమించటంలో వీరికెవ్వరూ సాటిరాలేరు. మఖా నక్షత్రంలో జన్మించిన వారికి భృత్యులు, ధనము, పరివారము ఉండును. భోగవంతులు, దేవ, పితృభక్తి గలవారు, ఉత్సాహవంతులు. పూర్వఫల్గుణి వారు ప్రియముగా మాట్లాడుదురు. దాతృత్వ గుణము, అందము, తిరుగుటయందాసక్తి ఉండును. రాజసేవ చేయుదురు. ఉత్తర ఫల్గుని (ఉత్తర) వారు సర్వజన ప్రియులు. విద్యా ప్రావీణ్యముతో ధనార్జన చేయుదురు. భోగవంతులు, సుఖవంతులు. వీరు అదృష్ట సంఖ్య 1,3,6,8,9, ఆది,మంగళ,శుక్ర, సోమ,శని వారములు కలిసి వచ్చును.

## సింహ రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 3,4 స్థానములలో, శని 5వ స్థానములో, రాహువు 12,11 స్థానములలో, కేతువు 6,5 స్థానములలో ఉండుట వలన

శారీరక శ్రమ అధికమగుట, ధనవ్యయము అధికమగుట, నిర్మాణాది పనులు, శుభకార్యక్రమములు, స్థిరాస్తుల కొనుగోళ్ళు వాయిదాలు పడుట, మానసిక ఆందోళనలు అధికమగుట, విద్యార్థులకు అధికశ్రమతో కూడుకొని ఉత్తీర్ణతలు వచ్చుట, ఉన్నత విద్యా ఆటంకములు, కళాకారులకు అధికశ్రమతో గుర్తింపులు వచ్చుట, స్థిరాస్తులను అమ్మకము చేయవలసి వచ్చుట, స్థిరత్వం కోల్పోవలసి వచ్చుట, అపనిందల పాలగుట, ధనమును కూడబెట్టుటకై శ్రమ అధికమైననూ పది పనులు చేయుట, తద్వారా లాభములు గడించుట, వత్సర అంత్యమున ఉద్యోగస్తులకు సానుకూల స్థానచలనములు మొదలగు మిశ్రమ ఫలితములు కలుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు సూర్యనమస్కారములు, అరుణహోమములు, ఎరుపు వస్త్రములను దానము చేయుట, మందారవృక్షములను పెంచుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం వాయిదా వేసిన పనులు పూర్తి చేయుట, స్త్రీ మూలక ధన లాభము ఏర్పడుట, శుభకార్యక్రమములకై ఖర్చులు అధికమగుట, అందరిని కలుపుకొని పనులు పూర్తి చేయుట, ఇతరుల కష్టములకు తగినంత సహాయము అందించుట, కుటుంబ పెద్దలకు ఆరోగ్య భంగములు ఏర్పడుట జరుగును.

**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సంఘంలో గౌరవ మర్యాదలు పెరుగుట, ఖర్చులు అధికమించటానికి విశ్రాంతి లేకుండా శ్రమించుట, బంధుమిత్రుల సహాయ సహకారములు తీసుకొనుట, నూతన కార్యక్రమములు చేపట్టుట, పెట్టుబడి వ్యాపారములు, పొత్తు వ్యాపారములు లాభించుట జరుగును.

**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ వ్యక్తులతో కలసి విందువినోదాలలో పాల్గొనుట, ఖర్చు అధికమగుట, సమయానికి ధనము చేతికందుట, మధ్యవర్తులను నమ్ముట వలన వస్తు నష్టములు, ధన నష్టములు కలుగుట, వృధా ప్రయాణములు చేయుట, సోమరితనం అధికమగుట జరుగును.

**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు ఆసక్తి లేకపోవుట, వాహనపరమైన ఇబ్బందులు వచ్చుట, దైవ దర్శనములు, పుణ్యస్థల దర్శనములు చేయుట, అధికారుల మన్ననలకై ప్రయత్నములు సాగించుట, మధ్యవర్తులను ఏర్పరచకుండా స్వయముగా వ్యవహారాలన్ని చూసుకొనుట జరుగును.

**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం బయటకి ఆడంబరంగా కనబడిననూ మానసిక ఆందోళనలు అధికమగుట, ఖర్చులు అదుపుచేయలేకపోవుట, కుటుంబ సభ్యులతో బయటివారితో మనశ్శాంతి లేకపోవుట జరుగును.

**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు దగ్గరి వారి సహకారము వలన అభివృద్ధి ఏర్పడుట, దగ్గరి మిత్రుల ఆర్థిక సహకారముతో ఋణ బాధలు నివృత్తి చేసుకొనుట, ప్రతిక్షణం ఏదోరకమైన ఆలోచనలతో మనస్సు నిలకడ లేకపోవుట జరుగును.

**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం భూ సంబంధ వ్యవహారములు లాభించుట, కుటుంబ వ్యక్తుల సంతోషముకై విలాసవంతమైన వస్తువులు కొనుగోలు చేయుట, ఖర్చులు అధికమగుట, వాహనపరమైన ఇబ్బందులు తలెత్తుట, వైద్యుల సలహా తీసుకోవలసి వచ్చుట, సోదరవర్గంతో సఖ్యత ఏర్పరచుకొనుటకు ప్రయత్నములు సాగించుట జరుగును.

**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు మెల్లమెల్లగా అనుకూలత్వము ఏర్పడుట, ఇతరుల విషయములలో జోక్యం చేసుకోవటం వలన ఇబ్బందులపాలగుట, శుభ కార్యక్రమములకు ప్రణాళికలు సిద్ధం చేసుకొనుట, మిత్రుల సహకారము తీసుకొనుట జరుగును.

**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు అనుకూలత్వము ఏర్పడుట, గృహ నిర్మాణాది పనులు ఒక కొలిక్కి వచ్చుట, నోటి దురుసుతనము వలన మానసికంగా అనుకూలత్వము లేకపోవుట, నూతన వ్యక్తులతో పరిచయములు ఏర్పడుట, దూరప్రయాణములు చేయుట జరుగును.

**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు ఆసక్తి లేకపోవుట, ఇతరులు చేసే చిన్నపనినైనా పెద్దగా ఆలోచించుట, స్వగృహముకంటే పరగృహములయందే కాలము వృధాగా గడుపుట, ప్రతిపనికి ఇంకొకరి సహాయము కావలసి వచ్చుట, ఇతరులను ద్రవ్య సహాయమునకై అర్థించుట జరుగును.

**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట, ప్రయాణాదులలో కొంత వ్యవహారము దెబ్బతినుట, కోపం వలన శత్రుత్వము పెంపొందించుకొనుట, గౌరవ మర్యాదలకై వెంపర్లాడుట, ధనవ్యయం చేసి అధికారుల మన్ననలు పొందుట జరుగును.

**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వ్యక్తులతో పరిచయములు ఏర్పడుట, వాదోపవాదములతో వృధాగా కాలయాపన చేయుట, ఋణ బాధలు తొలగించుకొనుట, మిత్రుల సహకారముతో వ్యాపారాదులు అభివృద్ధి చేసుకొనుట, గౌరవమును కాపాడుకొనుటకై ప్రయత్నములు చేయుట జరుగును.



# కన్య రాశి
## VIRGO

| ఆదాయం - 14 |
| --- |
| వ్యయం - ౦౨ |
| రాజ్యపూజ్యం - ౦౬ |
| అవమానం - ౦౬ |

**ఉత్తర 2,3,4, హస్త 1,2,3,4, చిత్తా 1,2, పాదాలలో జన్మించినవారు.**

**టో,పా,పి,పూ,షం,ణ,ఠ,పె,పో, అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**కన్యారాశి వారి లక్షణములు :**

తెల్లని శరీరకాంతి, శరీర ధారుఢ్యత, గుండ్రని ముఖము, పొడవు, పొట్టికాక మధ్యరకమైన మృదువైన స్త్రీ శరీరాకృతి కలిగి ప్రియముగా, అతి నెమ్మదిగా మాట్లాడుదురు. లజ్జగానూ, నెమ్మదిగాను, చూచుచు, నడచుదురు. దైవభక్తి కలిగియుందురు. శరీరాకృతి ఉండును. వీరికి దయాగుణం, దానగుణం ఎక్కువ. మేధా సంపన్నులు, నిజాయితీ, నమ్మకం కలుపుగోలుతనం, సానుకూల బాధ్యతాయుత ప్రవర్తన వాత్సల్యము, అభిమానము, వినయ విధేయతలు, బంధుప్రేమ వీరికి గౌరవం పొందే స్థితిలో వుంచుతాయి. నవ్వుతూ ఇతరులను నవ్వించగలరు. మాట సహాయము పొందుదురు. భార్యా బిడ్డలు, దాస దాసీ జనము, వీరిని అభిమానింతురు. జ్యోతిష్య గణిత విజ్ఞాన శాస్త్రము, నాట్యము, గానము, వాయిధ్యము, పుస్తక రచన, చిత్రలేఖనమందు నేర్పరులు. విజ్ఞానానికి సంబంధించిన రంగాలలోనూ మానసిక శ్రమతో కూడిన పరిశీలన, పరిశోధన, విశ్లేషణ వంటి వృత్తులలో స్వయం ప్రతిభ కలిగి బాగా రాణిస్తారు. ఆధ్యాత్మిక గురువులతో సన్నిహిత సంబంధాలు లభిస్తాయి. తల్లియందు ఎక్కువ అనురాగం కలిగియుందురు. మనస్సులోని గుట్టును రహస్యంగా ఉంచుకుంటారు. 24 సం॥రాల లోపుగాని 34 సం॥రాల తర్వాతగానీ వివాహం జరుగును. ఎక్కువకాలం ఇల్లు వదిలి, ఊరు వదిలి ఉండలేరు. గాఢమైన పరస్పరాపేక్ష యుండును. ఉత్తరోత్తర దాంపత్య జీవితం చక్కని అనురాగంతో కూడియుండును. సామాన్యంగా భార్య తరపు వారు మీయందు ధూర్తులై ఉందురు. వీరు పట్టినది బంగారమగును. జనసమూహమున్నచో బిడియము, పెద్ద వారిని స్వయముగా కలుసు కొనుటకు సిగ్గు, సంకోచము కలుగును. సహాయము అపరిచిత వ్యక్తుల నుండి లభించుచుండును. అవకాశములు ఇసుక నుండి నూనె తీసినట్లు వచ్చుచుండును. భాగస్వామ్య వ్యాపారం లాభసాటిగా ఉంటుంది. వీరికి పేకాట, లాటరీలు లాభించును. పెద్దలు ఇచ్చిన ఆస్తులు అన్యాక్రాంతమయ్యే అవకాశం ఎక్కువ. స్త్రీలకు అనకువ మంచితనం గృహ కార్యకలాపములలో కూడా చక్కగా పాల్గొని ఇల్లు తీర్చకొనగల దక్షత ఉండును. ప్రణయ వివాహము జరుగు అవకాశమున్నది. ఉత్తర ఫల్గుణి నక్షత్రములో జన్మించిన వారు సర్వజన ప్రియులు, విద్య వలన ధనార్జన చేయువారు భోగవంతులు, సుఖవంతులు. హస్తవారు ఉత్సాహవంతులు, ప్రతిభ కలవారు, మధుపానాసక్తి కలవారు, దయతక్కువ. చిత్త వారు చిత్ర వస్త్రములను చిత్రమాలికలను ధరింతురు. మంచి నేత్రములు, అవయవ సౌష్టవము కలిగియుందురు. వీరి అదృష్ట సంఖ్య 1,3,5,6,7,9, ఆది, మంగళ, గురు, శుక్ర వారములు కలిసిన మరింత మేలు.

### కన్య రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 2,3 స్థానములలో, శని 4వ స్థానములో, రాహువు 11,10 స్థానములలో, కేతువు 5,4 స్థానములలో ఉండుట వలన

సంఘంలో గౌరవ మర్యాదలు పెరుగుట, శుభకార్యక్రమ ప్రయత్నములు లాభించుట, ఇతరుల నుండి సోమ్ము వచ్చుట, సంతానముతో వివాదములు ఏర్పడుట, దైవకార్యక్రమాదులలో పాల్గొనుట, లోభత్వంతో ధనమును అదుపులో పెట్టుకొనుట, మొండి బాకీలు వసూలగుట, గృహనిర్మాణాది పనులు చురుకుగా సాగుట, ఆర్థికపరంగా అనుకూల ఫలితములు ఏర్పడుట, నూతన వస్తువాహనాదులను, స్థిరాస్తులను కొనుగోలు చేయుట ఆకస్మిక అధికార యోగం కలుగుట, కళాకారులకు మంచి గుర్తింపు వచ్చుట, విద్యార్థులు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై ఉన్నత విద్యను అభ్యసించుటకు అర్హత సంపాదించుట, విదేశయోగములు లాభించుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు సుబ్రహ్మణ్య ఆరాధనలు, నవనాగ హవనములు, పిల్లలకు తీపి పదార్థములు, గింజలు లేని ఫలములు దానము చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు అనవసరముగా మాటలు పడవలసి వచ్చుట, ఆకస్మిక స్థాన చలనములు ఏర్పడుట, అధికారులతో విభేదములు ఏర్పడుట, ఏది మాట్లాడినా వ్యతిరేఖత వచ్చుట, ఇతరుల వ్యవహారములలో జోక్యము చేసుకొనుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ వ్యక్తులతో మనస్పర్ధలు తొలగి సఖ్యత ఏర్పడుట, ఋణబాధలు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, గౌరవ మర్యాదలు పెంపొందించుకొనుటకై ప్రయత్నములు సాగించుట, స్త్రీ పరిచయములు ఏర్పడుట, నూతన వ్యాపారములు ప్రారంభించుట, లాభములు చేకూరుటకు ప్రయత్నములు జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వస్తు వాహనాదులు కొనుగోలు చేయుట, శుభకార్యక్రమములు సఫలమగుట, మాతాపితృ వర్గం వారితో స్వల్పంగా విభేదములు వచ్చుట, దేవాలయ సందర్శనములు చేయుట, స్థలమార్పులు చేయవలసి వచ్చుట, కొంత అహంకారముచే దగ్గరి వారిని దూరము చేసుకొనుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభకార్యక్రమములు చేయుటకు ప్రయత్నములు సాగించుట, వృత్తి ఉద్యోగాదులలో మార్పులు అధికమగుట, గౌరవ మర్యాదలు పెరుగుట, ఆకస్మికముగా ప్రయాణములు చేయవలసి వచ్చుట, ఆకస్మిక ధన లాభములు ఏర్పడుట, ఇతరుల మన్ననలు పొందుట జరుగును.
**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆరోగ్యము మెల్లమెల్లగా కుదుటపడుట, దూరప్రాంత ప్రయాణములు చేయవలసి వచ్చుట, ముఖ్యమైన వారితో మొండిగా మాట్లాడటం వలన విభేదములు ఏర్పడుట, మధ్యవర్తిత్వం చేయటం వలన నిందలు పడవలసి వచ్చుట, ఇతరుల తప్పిదాలకు బాధ్యత వహించవలసి వచ్చుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి చేయు వృత్తి వ్యాపారాదులయందు ఆసక్తి లేకపోవుట, వృధాగా కాలాయపన చేయుట, బంధుమిత్రులతో విభేదములు ఏర్పడుట, ఉదర సంబంధమైన, శిరోసంబంధమైన బాధలు ఏర్పడుట, ఇతరుల బాధ్యతలు నెత్తిమీద వేసుకొనుట, వాటిని తీర్చక అనవసరముగా మాటలు పడుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దూర ప్రాంత ప్రయాణములలో ధనలాభము చేకూరుట, స్త్రీ మూలకముగా వస్తులాభములు వచ్చుట, ఆర్థికపరముగా అనుకూలంగా ఉన్ననూ మాటకు విలువ లేకపోవుట, దేవాలయ సందర్శనములు చేయుట, సేవా కార్యక్రమాదులలో పాల్గొనుట జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆర్థికపరంగా అనుకూలంగా ఉన్ననూ ఇతరులను నమ్మక అన్ని పనులు ఒక్కరే చేయుటవలన అలసట, అధిక శ్రమ కలుగుట, ప్రముఖులతో సంబాషించుట, ముఖ్య కార్యక్రమములకు అతిథిగా వెళ్లుట, వైద్యుల సలహా తీసుకోవలసి వచ్చుట, అంతశ్శత్రువులు అధికమగుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం తొందరపాటు నిర్ణయములతో ఇతరులకు ఇచ్చిన మాటను నిలబెట్టుకోలేకపోవుట, తద్వారా మాటలు పడవలసి వచ్చుట, కుటుంబ వ్యక్తులలో ఒకరికి అనారోగ్యము వాటిల్లుట, గౌరవ మర్యాదలకు ఆటంకములు ఏర్పడుట, మానసిక అశాంతి స్థిరచిత్తం లేకపోవుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆదాయంపరంగా అనుకూలంగా ఉన్ననూ ప్రతిఒక్కరిని అనుమాన దృష్టితో చూచుట, చంచలమైన మనస్తత్వంతో ఇతరులను ఇబ్బందిపెట్టుట, దైవ కార్యక్రమాదులలో పాల్గొనుట, వివాహాది ప్రయత్నములు సాగించుట, పెద్దల సహకారము తప్పనిసరిగా తీసుకోవలసి వచ్చుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం వ్యాపారాదులయందు అనకూలత్వము ఉన్ననూ పనివారితో, సహోద్యోగులతో మనస్పర్ధలు అధికమగుట, మానసిక ప్రశాంతత లేకపోవుట, ఎదుట నుంచి వెనుక చెడు అనే విధంగా ప్రతిఒక్కరు మీతో వ్యవహరించుట, కులదేవతను ఆరాధించవలసి వచ్చుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రముఖుల సలహాలు తీసుకొనుట, రక్షక భటులతో ఇబ్బందులు ఏర్పడుట, చేయు ఉద్యోగాదులలో అధికారులతో అపనిందలు పడవలసి వచ్చుట, తెలిసినా కూడా సోమరితనంతో పనులు పూర్తి చేయలేకపోవుట, పూర్తి చేస్తానని మరలామరలా ఇతరులను ప్రార్థించుట జరుగును.



# తులా రాశి

## LIBRA

ఆదాయం - 11
వ్యయం - 05
రాజ్యపూజ్యం - 02
అవమానం - 02

**చిత్తా 3,4, స్వాతి 1,2,3,4, విశాఖ 1,2,3 పాదాలలో జన్మించినవారు.**

**రా,రి,రూ,రే,రో,త,తీ,తూ,తే అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**తులారాశి వారి లక్షణములు :**

వీరు మేధావంతులు, శుచిమంతులు, ధనవంతులు, క్రయ విక్రయమునందు నేర్పరులు, తిరుగుటయందు ఆసక్తిపరులు. వీరికి రెండుపేర్లుండును. స్నేహపాత్రులు, జాలి, దయ, మానవత్వం, ప్రేమ, మంచితనం లాంటి భావాలు ఎక్కువ. దేవతలను, బ్రాహ్మణులను, సాధువులను పూజింతురు. సినీ రంగమునందు, అధ్యాపకులుగానూ, వైద్య వృత్తియందున ప్రఖ్యాతిగాంతురు. ఉపకారము చేసిననూ బంధువులు వీరిని పరాభవింతురు. మానసికంగాను, శారీరకంగానూ చురుకుగా ఉంటారు. నలుగురితో కలిసిపోయే తత్వము వలన ఎదుటివారు వీరిని అపార్థం చేసుకుంటారు. ఒకరి ముందు తలవంచి బ్రతకటం అంటే ఇష్టపడరు. ఎదుటి వారి స్వార్థపూరిత ఆలోచనలను హర్షించలేరు. తల్లిదండ్రులు, మిత్రులు వీరిని అర్థం చేసుకోలేరు. భాగస్వామ్య వ్యాపారం అన్ని వేళలా కలిసిరాదు. సమాజంలో ఉన్నత స్థానానికి ఎదగగలరు. వీరిని మెప్పించటం, వీరిచేత శభాష్ అనిపించుకోవడం తేలికకాదు. ఆకర్షణ,అందం, హుందాతనం వీరి సొంతం. ఆర్థిక క్రమశిక్షణ బాగా పాటిస్తారు. యవ్వనంలో అదృష్టం కలిసివస్తుంది. స్థిరాస్థి వృద్ధి విలువ పెరుగుతుంది. తరతరాలకు ఆదర్శంగా నిలుస్తారు. చంద్రగ్రహణ ప్రభావం ఎక్కువగా ఉంటుంది. కుటుంబంలో అనైక్యత చికాకు కలిగిస్తుంది. భార్య మనసుకు అసంతృప్తి కలగకుండా ప్రవర్తింతురు. స్త్రీలకు గృహనిర్వాహణా దక్షత, అనేక లలితకళా నైపుణ్యం, చక్కని వస్తువులను సేకరించి భద్రపరచి వినియోగించుట, శుచి శుభ్రత హెచ్చు. పువ్వుల వంటి దుస్తులు, చక్కగా అమర్చిన తల్పము, తీర్చిన ఇల్లు, రుచ్యములైన వివిధ భక్ష్య భోజ్యములు ఇష్టము. లలిత కళలలో చక్కని అభిరుచి, నైపుణ్యముండును. భర్తకును బిడ్డలకు సుఖము చేకూర్చుట, మంచి పోషణ రక్షణ దక్షతయుండును. పాక విద్యలో ప్రత్యేక ప్రావీణ్యముండును. వీరి పెంపకమున పిల్లలు విద్యా, వివేక, వినయవంతులగుదురు. వివాహ సంబంధములు కుదుర్చుట, పెండ్లి పనులు సానుకూలముగా చేయుట యందు వీరికి నైపుణ్యము, అభిలాష హెచ్చు. గుండ్రటి ముఖము తీరైన ముక్కు పొడవైన, ధృడమైన, అందమైన శరీరాకృతి కలిగియుందురు. చిత్తా నక్షత్రమున జన్మించిన వారు చిత్ర వస్త్రములు చిత్రమైన మాలలను ధరింతురు. మంచి నేత్రములు అవయవ సౌష్టవము కలిగియుందురు. స్వాతి వారు వినయము కలవారు. జితేంద్రియములు, వ్యాపార కుశలురు, దయగలవారు, ప్రియముగమాట్లాడుదురు. ధర్మమునందాసక్తికలిగి ఉందురు. విశాఖవారు ఈర్ష్య గలవారు, లోభత్వముండును. ప్రకాశవంతులు మాట్లడుటలోను ధనార్జనలోను సమర్థులు. విరోద స్వభావము కలిగియుందురు. పడమట, దక్షిణ దిక్కులు కలసివస్తాయి. వీరి అదృష్ట సంఖ్య 1,3,4,6,9, మంగళ, బుధ, శుక్రవారములు కలిసి వచ్చును.

### తుల రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 1,2 స్థానములలో, శని 3వ స్థానములో, రాహువు 10,9 స్థానములలో, కేతువు 4,3 స్థానములలో ఉండుట వలన

స్థానచలనములు ఏర్పడుట, చేయు వృత్తి వ్యాపారాదులలో కొత్త వారిని నమ్ముట వలన మోసపోవలసి వచ్చుట, అధికారుల ఒత్తిడి కొంత ఉన్ననూ గుర్తింపు తెచ్చుటకొనుట, కొన్ని సమయము ల యందు దగ్గరికి వచ్చిన పనులు దూరమగుట, పనులయందు ఆసక్తి తక్కువగా ఉండుట, పొత్తుదారులతో, మధ్యవర్తులతో మాటపట్టింపులు వచ్చుట, దైవసందర్శనము లు చేయుట, దైవ క్షేత్రములు దర్శించుట, కళాకారులకు ఆందోళనలతో కూడిన గుర్తింపులు వచ్చుట, విద్యార్థులకు మొదటి ప్రయత్నములు విఫలించుట, రెండవ ప్రయత్నమందు అనుకూల ఫలితములు వచ్చుట, ఉన్నత విద్యకు ఇతరుల సహకారం లభించుట, ఋణప్రయత్నములు చేయవలసి వచ్చుట, నడుము క్రింది భాగమునకు సంబంధించిన ఇబ్బందులు వచ్చుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు గోసేవ చేయుట, రుద్రహవనములు, సహస్రలింగార్చనలు, దుంపకూరలను దానము చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కోర్టు వ్యవహారములు, రక్షణశాఖవారి వ్యవహారములలో తలదూర్చుట వలన ఇబ్బందులు పొందుట, బంధుమిత్రులతో మనస్పర్ధలు వచ్చుట, అకాలములో గృహనిర్మాణాది పనులు చేయుటకు సంకల్పించుట, అధిక ఖర్చుల వలన ఆర్థిక ఇబ్బందులు ఏర్పడుట జరుగును.

**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ వ్యక్తులతో సఖ్యత లోపించుట, ఇతరుల విషయాలలో జోక్యం చేసుకొనుట వలన అనవసరముగా కష్టములను కొని తెచ్చుకొనుట, వాహనపరమైన ఇబ్బందులు వాటిల్లుట, ఆకస్మిక ధనలాభము కలిగిన ఖర్చుల వలన ధనము నిల్వ లేకపోవుట జరుగును.

**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శారీరక శ్రమ అధికమగుట, నూతన వ్యక్తులతో పరిచయములు ఏర్పడుట, ఎదుటివారిని గుడ్డిగా నమ్మి మోసపోవలసి వచ్చుట, మిత్రుల సహకారముతో అనుకూలత్వము ఏర్పడుట, కుటుంబ సభ్యులతో కలసి విందు వినోదాలలో పాల్గొనుట, మాసాంతమున నూతన వస్తువులను ఖరీదు చేయుట జరుగును.

**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు మార్పులు అధికమగుట, నూతన వ్యాపారాదులలో మిత్రులతో కలసి పెట్టుబడులు పెట్టుట, ఋణ బాధలు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, గత కొద్ది సంవత్సరాల కాలం నుండి పడుతున్న బాధలు మెల్లమెల్లగా సమసిపోవుట జరుగును.

**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శ్రమ తగిన గుర్తింపులు వచ్చుట, ఆకస్మిక ధన లాభములు ఏర్పడుట, స్త్రీ మూలకముగా కలహములు ఏర్పడుట, నిద్రలేమితనము ఆకాల భోజనముల వలన శారీరక శ్రమ అధికమగుట జరుగును.

**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రముఖులతో పరిచయముల ఏర్పడుట, రహస్యముగా వ్యవహారములను చక్క బెట్టుట, నూతన వ్యాపారములు కలసి వచ్చుట, సంఘములో గౌరవ మర్యాదలు పెరుగుట, బంధుమిత్రుల సహాయ సహకారములు లభించుట, మానసిక ప్రశాంతత ఏర్పడుట జరుగును.

**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దైవ కార్యాక్రమాదులలో పాల్గొనుట, పెద్దల పేరిట దానాదులు చేయుట, అనారోగ్య సమస్యలు సమసిపోవుట, బంధుమిత్రులతో కలసి విహారయాత్రలు విందువినోదాలలో పాల్గొనుట, బయటఉన్న ఆనందం ఇంటి యందు లేకపోవుట, ఆదాయమునకు తగ్గట్లుగా ఖర్చులు పెరుగుట జరుగును.

**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఉమ్మడి వ్యాపారములలో లాభములు అనుకూలముగా లేకపోవుట, సొంత వ్యాపారములు చేయుట, తద్వారా ఆర్థికాభివృద్ధిని పెంచుకొనుట, వాహనపరమైన ప్రయాణపరమైన ఇబ్బందులు వాటిల్లుట, బంధుమిత్రుల రాక తద్వారా ధనవ్యయము అధికమగుట జరుగును.

**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రతిచిన్న విషయమునకు కోపం అధికమగట, అకారణ కలహములు ఏర్పడుట, అధికారులతో మన్ననలు పొందుటకై తాపత్రయం పడుట, ప్రయాణములు అధికముగా చేయవలసి వచ్చుట, పక్కవారి తప్పిదములకు తెలిసికూడా సహకారములు అందించుట జరుగును.

**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అధికారులతో సఖ్యత అధికమగుట, సహోద్యోగుల, వ్యాపారస్తుల ఈర్ష్యఅసూయలు అధికమగుట, దైవ అనుగ్రహముచే అప్రయత్నముగా పనులు పూర్తియగుట, తద్వారా లాభములు చేకూరుట, ప్రయాణాదులలో స్త్రీ పరిచయములు ఏర్పడుట, తద్వారా లాభములు చేకూరుట జరుగును.

**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కోర్టు లావాదేవీలు సమసిపోవుట, అధిక ప్రయాణములు చేయవలసి వచ్చుట, సంతానపరమైన ఇబ్బందులు వాటిల్లుట, దైవ సందర్శనములు, పుణ్యక్షేత్రములు దర్శించుట, ఇతరులతో కొద్దిగా మాటపట్టింపులు వచ్చుట, ఒంటరిగానైననూ పనులన్నియూ పూర్తి చేయుట జరుగును.

**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభ కార్యక్రమాదులలో పాల్గొనుట, ప్రత్యేక ఆకర్షనగా కనిపించుట, చిరకాల బంధుమిత్రలను కలుసుకొనుట, మానసిక ప్రశాంతత ఏర్పడుట, శారీరక శ్రమ అధికముగా ఉన్ననూ బంధుమిత్రులతో కలసి దూరప్రయాణములు చేయుట, ప్రముఖులను కలుసుకొనుట జరుగును.



# వృశ్చిక రాశి

## SCORPIO

| |
|---|
| ఆదాయం - 02 |
| వ్యయం - 14 |
| రాజ్యపూజ్యం - 05 |
| అవమానం - 02 |

**విశాఖ 4, అనురాధ 1,2,3,4, జ్యేష్ఠ 1,2,3,4 పాదాలలో జన్మించినవారు.**

**తో, నా, నీ, ను, నే, నో, యా, యి, యు, అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**వృశ్చికరాశి వారి లక్షణములు :**

వీరికి మంచి కలుపుగోలుతనం, దయ, ప్రేమాభిమానాలు, నిజాయితీ, ధైర్యము, నేర్పరితనం, ఓర్పు ఎక్కువ. మానసిక శక్తిని మానవాతీత శక్తులపై కేంద్రీకరించి మంచి ప్రగతిని సాధిస్తారు. బలమైన శరీర ధారుధ్యము, విశాల నేత్రములు, వక్ష స్థలము, వర్తులమైన పిక్కలు, తొడలు, మోకాళ్ళు కలిగియుందురు. రాజవంశములచే పూజింపబడుదురు. పింగళ వర్ణముతో విషయ స్వభావముతో నుందురు. మత్స్యరేఖ, ఆయుష్య రేఖ, పక్షి రేఖలు కలిగియుందురు. తల్లిదండ్రుల, గురువుల యెడల గౌరవం కలిగి ఉంటారు. తల్లిదండ్రులు వీరిలోని భయము, రహస్య గోపనములను గుర్తించి, మంచి వారితోగాని, హోదాగల వారితో గాని నిమగ్నులను చేసిన చక్కని ధైర్యం, స్వతంత్ర ప్రవృత్తి, విద్యాబుద్ధులు అలవడి చాలా గొప్పవారగుదురు. నిత్య నూతన ఆలోచనలతో ఏ రంగంలోనైనా రాణిస్తారు. ఆటలయందు నాటకములందు, శస్త్ర విద్యయందు అభిరుచి ఎక్కువ. రహస్య విషయములు బయట పెట్టరు. భూమి, వాహన, యంత్ర సంబంధిత వ్యవహారాలు కలిసివస్తాయి. గర్వమెక్కువ, నిశ్చితాభిప్రాయములను నిర్మొహమాటముగా వెల్లడిస్తారు. డాక్టర్స్‌గా, సర్జన్స్‌గా ఉన్నవారు మంచి హస్త వాసి కలిగి రాణిస్తారు. మంచి వాక్ చాతుర్యంతో ఎదుటివారిని ఆకర్షిస్తారు. కోపం ఎక్కువ గట్టిగా మాట్లాడుదురు. కక్ష సాధించే పట్టుదల ఉండును. మితిమీరిన అలవాట్లు ఉంటాయి. కష్టం, కన్నీళ్ళు ఆవేదన వ్యక్తం చేసి కొంతమంది వీరిని మోసగిస్తారు. ఇతరులను హేళన చేయు స్వభావముండును. సలహాలు ఇవ్వటంలో నేర్పరులు. సమస్యా పరిష్కారమునకు ఏ పనినైనను, సమర్థవంతముగా చేస్తారు. ఇద్దరు విభిన్న వ్యక్తుల వంటి ప్రవర్తనమును వీరు వేర్వేరు రంగాలలో జీవితాంతము నిర్వహింపగలరు. భూ వసతి కల్గియుందురు. స్త్రీలతో బంధువులతో వైరం, పరోక్ష శత్రుత్వం కలిసిరావు,స్త్రీలు – శిశు పోషణ, గృహ నిర్వహణ నైపుణ్యం, సామర్థ్యము కలిగి ఉందురు. భర్తలకన్నా భార్యలు చాలా మంచివారు, భర్తయందు, పిల్లలయందు ప్రేమాభిమానాలు, పోషణ నిర్వహణ సామర్థ్యము కల్గియుందురు. ప్రేమలో మోసం చేయగల సాహసులు, బహు తత్వముండును. విశాఖ నక్షత్రంలో జన్మించినవారు. ఈర్ష్యా, లోభత్వము కలవారు, ప్రకాశవంతులు, ధనార్జన యందు నిపుణులు, కలహప్రియులు, అనురాధవారు, సమర్థులు విదేశ నివాసమందు ప్రీతి గలవారు.ఆకలిని ఓర్చుకొనలేరు. తిరుగుటయందాసక్తి కలిగియుందురు. జ్యేష్టవారు స్వల్ప మిత్రులు కలిగి సంతోష స్వభావం, ధర్మ కార్యాచరణయందాసక్తి అతి కోపము కలిగియుందురు. వీరి అదృష్ట సంఖ్య 1,2,4,6,8,9, బుధ, గురు, శుక్ర, శని వారములు కలసిన మరింత మేలు.

### వృశ్చిక రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 12,1 స్థానములలో, శని 2వ స్థానములో, రాహువు 9,8 స్థానములలో, కేతువు 3,2 స్థానములలో ఉండుట వలన

మానసిక ఆందోళనలు అధికమగుట, చేయువృత్తి వ్యాపారాదులలో అనుకూల ఫలితములు ఏర్పడుట, వస్తువాహనాదులను కొనుగోలు చేయుట, అధిక శ్రమవలన ఔషదసేవ చేయవలసి వచ్చుట, శుభకార్యక్రమ ప్రయత్నములు లాభించుట, కళాకారులకు వచ్చుట, ప్రముఖులను కలుసుకొనుట, వారి మన్ననలు పొందుట, సంతానపరమైన శుభవార్తాలు వినుట, భూసంబంధమైన వ్యవహారములు అనుకూలించుట, సోదరవర్గం వారితో స్వల్పంగా మాటపట్టింపులు వచ్చుట, ప్రముఖక్షేత్రములు సందర్శించుట, విద్యార్థులకు బోటాబోటి మార్కులతో అనుకూల ఫలితములు వచ్చుట, విదేశీ ప్రయత్నములు వాయిదాపడుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు దుర్గాఆరాధనలు, శ్రీచక్ర నవావరణార్చనలు, పప్పుదినుసులు, భోజన సామాగ్రి దానం చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అనవసరపు ప్రయాణములు చేయవలసి వచ్చుట, చేయు వృత్తి వ్యాపారాదులయందు అధికారుల వ్యతిరేఖత ఏర్పడుట, అకాల భోజనముల వలన అనారోగ్యము ఏర్పడుట, ఇతరుల పై అధికారము చెలాయించుటకు ప్రయత్నము చేసి నిందలు పడవలసి వచ్చుట జరుగును.

**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం స్థానచలనములు ఏర్పడుట, నిలకడ లేని మాటలతో శత్రుత్వములు పెంచుకొనుట, సోదరవర్గం వారితో విభేదములు ఏర్పడుట, అనవసరమైన పనులకు ప్రాధాన్యము ఇచ్చుట, ఫలితము లేకపోవుట, సంతానమునకు అనారోగ్యము వాటిల్లుట, వ్యసనములకు లోబడుట జరుగును.

**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దూర ప్రాంత ప్రయాణములు చేయవలసి వచ్చుట, శుభ కార్యక్రమ ప్రయత్నములు కష్టముచేత సఫలీకృతమగుట, చేయు వృత్తి వ్యాపారాదులయందు మార్పులు అధికమగుట, తొందరపాటు నిర్ణయముల వలన ఇబ్బందులు అధికమగుట, మిత్రుల సహకారము సమయానికి అందుట జరుగును.

**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నిలకడలేని మనస్తత్వంతో పనులయందు ఆసక్తి లేకపోవుట, వాహనపరమైన ఇబ్బందులు ఏర్పడుట, ఆకస్మిక ధన లాభములు ఉన్ననూ అధిక ఖర్చుల వలన ధనము నిల్వ లేకపోవుట, తిరిగి ఋణములు చేయవలసి వచ్చుట, గౌరవ మర్యాదలకు దెబ్బ వాటిల్లుట జరుగును.

**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పాతమిత్రులను కలుసుకొనుట, శుభకార్యక్రమ ప్రయత్నములు లాభించుట, ఖర్చులు అధికమగుట, విందువినోదాలలో పాల్గొనుట, మాసాంతమున దురుసుతనముతో విభేదములు ఏర్పడుట జరుగును.

**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం గౌరవ మర్యాదలు పెరుగుటకు, పది మందిలో ఉన్నతంగా కనిపించుటకు ధనము ఖర్చు చేయుట, చెడు పనులకు సహకారమందించుట, ప్రభుత్వ అధికారులతో ఇబ్బందులు ఏర్పడుట, సోదర వర్గం వారితో కొద్దిగా విభేదములు వచ్చి మరల సమసిపోవుట జరుగును.

**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు బంధు, మిత్ర వర్గం సహకారముతో లాభములు ఏర్పడుట, మాటకు విలువేర్పడుట, నూతన వ్యక్తులతో పరిచయములు ఏర్పడుట, దైవ కార్యక్రమాదులలో పాల్గొనుట, పనివారితో మాటపట్టింపులు వచ్చుట జరుగును.

**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వస్తువులను కొనుగోలు చేయుట, గృహోపకరణములకై ధనమును వ్యయము చేయుట, పితృసంబంధితుల నుండి చెడు వార్తలు వినవలసి వచ్చుట, అకాల భోజనములు, అనుకోని మనస్పర్ధలు ఏర్పడుట, కుటుంబ వ్యక్తులతో కలసి దూరప్రాంతములకు వెళ్లుట జరుగును.

**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు ఆశించినంత లాభములు ఉన్ననూ ఆదాయమును మించిన ఖర్చుల వలన ధనము నిల్వ ఉండకపోవుట, సమయానికి ఋణ సహాయములు కూడా అందకపోవుట, భూ సంబంధ వ్యవహారములయందు అవకతవకలు ఏర్పడుట జరుగును.

**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఒంటరి జీవనాన్ని ఇష్టపడుట, ఇతరులతో మనస్ఫూర్తిగా సఖ్యతతో ఉండలేకపోవుట, ప్రతివారిని అనుమాన దృష్టితో చూచుట, నూతన వస్తువాహనాదులను కొనుగోలు చేయుట, సోదరవర్గం వారి సహకారములు లభించుట, తద్వారా అనుకూలత్వములు ఏర్పడుట జరుగును.

**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు ఉన్నత స్థితి ఏర్పడుట, గౌరవ మర్యాదలు పెరుగుట, ఆకస్మిక ధన లాభములు కలుగుట, దూరప్రాంత ప్రయాణములయందు లాభములు చేకూరుట, గత కొద్దికాలముగా పడుతున్న ఇబ్బందులు మెల్లమెల్లగా సమసిపోవుట జరుగును.

**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వ్యక్తులతో పరిచయములు ఏర్పడుట, అన్నింటియందు విజయములు చేకూరుతాయనే అతివిశ్వాసముతో కొద్దిగా దెబ్బతినుట, ఆకస్మిక క్రోధము వలన మిత్రులను దూరము చేసుకొనుట, అధికారుల మన్ననలు పొందుటకు ప్రయత్నములు సాగించుట జరుగును.



# ధనస్సు రాశి

**SAGITTARIUS**

| |
|---|
| ఆదాయం - 05 |
| వ్యయం - 05 |
| రాజ్యపూజ్యం - 01 |
| అవమానం - 05 |

**మూల 1,2,3,4, పూ॥షా॥ 1,2,3,4, ఉ॥షా॥ 1వ పాదాలలో జన్మించినవారు.**

**యె,యో,బా,బి,బు,ధా,భా,ఢా,బే అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**ధనుస్సురాశి వారి లక్షణములు :**

వీరు ఏకాగ్రత, పట్టుదల, అభిమానము, కార్యసాధన, దీక్ష, త్యాగ, ధర్మ గుణములను కలిగి ఉంటారు. ప్రతిభావంతులై ప్రతి విషయాన్ని అర్థం చేసుకొని బాగా మాట్లాడగలరు. విద్యాభిమానులు, తీర్థయాత్రలు, సంగీత, సాహిత్యములందు మతపరమైన విషయములందు ఆసక్తి చూపిస్తారు. లౌక్యులు, లెక్కలు వేయువారు, ప్రజలతో సంబంధ బాంధవ్యములు కలిగి లిపి, పుస్తక లేఖన, విజ్ఞానములు, వ్యాయామములు, తాలింఖానా, సర్కసు మున్నగు వినోద విద్యలు కలిగి బోధన, న్యాయవృత్తులు, రేడియో మున్నగు వానిలో ప్రకటనోపన్యాస వృత్తులు, బ్యాంకు ఇన్సూరెన్స్, ట్రెజరీ వృత్తులు అనుకూలం. నీతి నిజాయితీ కలిగి, నిక్కచ్చిగా మాట్లాడే స్వభావం వలన శత్రువర్గం పెరుగుతుంది. వీరు నిర్లక్ష్యం చేసినవారు సమస్యలు సృష్టించి కుట్రలు చేయుట వలన ఆదాయమునకు విఘాతములు కలుగును. ఆహార సౌఖ్యమునకు మిత్రులకు, గొప్పకు ధనవ్యయముండును. నూతన పనులు ప్రారంభించి మధ్యలో నిలిపివేస్తారు. భాగస్వామ్యం బాగా కలిసివస్తుంది. వాహన యోగముండును. జీవితంలో అత్యున్నత పదవులను అందుకుంటారు. వీరి తండ్రి ధనవంతుడు, 21,26,30 సం॥ముల వయస్సులో తొందరపాటుతనముతో మాటజారి దానికి కట్టుబడ వలసి వచ్చుట, లౌక్యమెరిగిన వ్యక్తితో వీరికి దాంపత్యముండును. సంగీత, చిత్ర లేఖనము, కుట్లు, అల్లికలలో ప్రావీణ్యము, గృహాలంకరణ పై ఇష్టత ఉండును. దాంపత్యమున చిన్న చిన్న విఘాతములు ఉండును. నడి వయస్సులో ఖర్చులు పెరుగుట వలన ఆర్థిక ఇబ్బందులు పెరుగును. గుర్రపు పందాలు, షేర్లు, గుర్తులు గల వ్యక్తులు, సంస్థలు అనుకూలించును. పిల్లలు చురుకుదనం కలిగి సాంఘికం, విద్యా సంబంధముల యందు ఉన్నత స్థితి పొందుదురు. యంత్ర వాహన శాఖలలో పనిచేయుదురు. నడి వయస్సులో బరువు బాధ్యతలు పెరుగును. సూర్యగ్రహణ సమయాలలో మరిచిపోలేని సంఘటనలు జరుగును. 39,48,57 సం॥రములలో స్థానచలనము జరుగును. 45,54,63 సం॥రములలో మారక సంబంధములు కలవు. ఒక వ్యక్తితో ఎక్కువ కాలము స్నేహపూర్వకంగా స్థిరమైన ఆలోచనలతో ఉండుట కష్టము. ఎంత మందిని ప్రేమిస్తే అంత గొప్ప అనుకునే తత్వం గలవారు. స్వేచ్ఛా తత్వాన్ని ఇష్టపడేవారు. మూలా నక్షత్రమున జన్మించినవారు మానవంతులు, సుఖవంతులు, సౌమ్యులు, స్థిర చిత్తులు, గర్వం కలవారు, స్థిరమైన మిత్రులు లేనివారై ఉందురు. పూర్వాషాఢ నక్షత్రం వారు వారి ఇష్టమునకు తగ్గట్టుగా నడుచుకునేవారిని ప్రేమించెదరు. భోగవంతులు, మిత్రుల వలన మోసపోవుదురు. ఉత్తరాషాఢ నక్షత్రం వారు వినయమును కలిగి సర్వజనులకు ప్రియమైనవారు అనేకమంది మిత్రులు కలిగినవారు అవుదురు. వీరి అదృష్ట సంఖ్య 1,3,5,6,9 ఆది, గురు, బుధ, శనివారములు అత్యంత శుభదాయకము.

## ధనస్సు రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 11,12 స్థానములలో, శని 1వ స్థానములో, రాహువు 8,7 స్థానములలో, కేతువు 2,3 స్థానములలో ఉండుట వలన

తొందరపాటు తనంతో సన్నిహితులను దూరము చేసుకొనుట, చేయువృత్తి వ్యాపారాదుల యందు ఆటంకము లు ఉన్ననూ చివరిన విజయములు చేకూరుట, రక్తమునకు, నేత్రములకు, నరములకు సంబంధించిన ఇబ్బందులు వచ్చుట, ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట, బంధువులతో స్వల్ప విరోధములు ఏర్పడుట, వృధాగా ఖర్చులు చేయుట, ప్రముఖుల సహకారముతో అనుకూల ఫలితములు వచ్చుట, విద్యార్థులకు మొదటి ప్రయత్నము నందు అధికశ్రమ వలన కూడా ఫలితము ఉండకపోవుట, రెండవ ప్రయత్నమందు లాభించుట, శుభకార్యక్రమ ప్రయత్నములు లాభించుట, అధికారుల అనుకూలత తగ్గుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు వరాహమూర్తిని ఆరాధించుట, అమ్మవారి ఆలయాలలో ముదురు ఎరుపు రంగు వస్త్రములను సమర్పించుట, ఉసిరిక వృక్షములను సేవించుట, వేదపండితులకు ఉసిరిక ఫలములను దానము చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కోపముచేత ఇతరులతో విభేదములు ఏర్పడుట, ఆర్థికంగా ఇబ్బందులు ఉండుట, మిత్రుల సహకారమునకై తప్పక ప్రయత్నములు చేయవలసి వచ్చుట, మాసాంతమున ఆర్థికాభివృద్ధి కొద్దికొద్దిగా కలుగుట, శత్రుత్వములు పెరుగుట, ప్రతిపనియందు ఆటంకములు అధికముగా ఉండుట జరుగును.

**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు అధికారుల మన్ననలు పొందుట, ముఖ్య కార్యక్రమములయందు ప్రధానవక్తగా ఉండవలసి వచ్చుట, దైవ కార్యక్రమాదులలో పాల్గొనుట, శుభ కార్యక్రమ ప్రయత్నములు లాభించుట, ఇతరులకు ఇచ్చిన మాటను నిలబెట్టుకోలేకపోవుట జరుగును.

**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ప్రతిపనియందు ఆటంకములు అధికమగుట వలన చేయు వృత్తి వ్యాపారాదులలో ఆసక్తి లేకపోవుట, ఆర్థిక పరిస్థితి అనుకూలంగా ఉన్ననూ గుర్తింపులు లేకపోవుట, తెలిసికూడా నీచకార్యక్రమాలకు సహకారమందించుట, ఇతరుల తప్పిదములకు అనసరముగా మాటలు పడవలసి వచ్చుట జరుగును.

**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సమయానికి ఏదోరకముగా ధనము చేతికందుట, పెట్టుబడి వ్యాపారములు, పొత్తు వ్యాపారములు లాభించుట, ఇతరుల దృష్టి దోషములు అధికమగుట, అనవసర ప్రయాణములు చేయవలసి వచ్చుట, నూతన వస్తు ఆభరణాదులను కొనుగోలు చేయుట, సభలయందు పాల్గొనుట జరుగును.

**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన కార్యక్రమములు ప్రారంభించుట, ఆకస్మిక ధనలాభములు ఏర్పడుట, చేయుపనులకు ఇతరులకు అధికముగా గుర్తింపులు వచ్చుట, తద్వారా మానసిక సంక్షోభము పొందుట జరుగును.

**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట, శారీరక శ్రమ అధికమగుట, మాతపితృవర్గం వారికి అనారోగ్యములు ఏర్పడుట, సేవాసంస్థలతో కలసి పనిచేయవలసి వచ్చుట, దైవ కార్యక్రమాదులలో పాల్గొనుట, మానసిక ప్రశాంతత చేకూరుటకై ప్రయత్నములు సాగించుట జరుగును.

**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం గౌరవమర్యాదలకు భంగమువాటిల్లుట, అనవసరముగా మాటలు ఇచ్చుట, మధ్యవర్తిత్వములు చేయుట వలన కీర్తి నష్టము, ధన నష్టము కలుగుట, కీటక, జంతు సంబంధమైన ఇబ్బందులు వాటిల్లుట, కుటుంబ వ్యక్తులకు ఆరోగ్యము సక్రమముగా ఉండకపోవుట జరుగును.

**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శత్రుత్వములు అధికమగుట, ప్రతి ఒక్కరియందు అనుమానములు పెంచుకొనుట, నూతన ప్రయత్నములు లాభించిననూ ఇతరుల సహకారము సమయానికి అందకపోవుట, ఒంటెద్దు ప్రయాణము చేయవలసి వచ్చుట, కలహములు అధికమగుట జరుగును.

**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సభలయందు పాల్గొనుట, శుభ కార్యక్రమములయందు ప్రముఖపాత్ర వహించుట, విందువినోదాలలో పాల్గొనుట, అధికారుల మన్ననలు పొందుట, ఆడంబరమునకై ఖర్చులు అధికమగుట, మానసిక సంతృప్తికై చేయు ప్రయత్నములు సఫలీకృతమగుట జరుగును.

**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు స్థాన చలనములు అధికమగుట, పనివారితో సఖ్యత లేకపోవుట వలన ఒక్కరే అన్నిపనులు చేసుకోవలసి వచ్చుట, ఆర్థికముగా అనుకూలముగా ఉన్ననూ గౌరవమర్యాదలు అంతంత మాత్రముగానే ఉండుట, శారీరక శ్రమ అధికమగుట జరుగును.

**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం వివాహాది శుభకార్యక్రమములు దిగ్విజయముగా పూర్తి చేయుట, బంధుమిత్రులను కలుసుకొనుట, అధికముగా ధన వ్యయమగుట, సోదరవర్గం వారితో కలసి చేయు పొత్తు వ్యాపారాదులు లాభించుట, బ్యాంకు వాటాలయందు విలువలు తగ్గుట, ఆస్తి తగాదాలు సమసిపోవుట జరుగును.

**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అధికారుల మన్ననలు పొందుట, చేయువృత్తి వ్యాపారాదులయందు గౌరవ మర్యాదలు పెరుగుట, కొద్దిగా అలక్ష్యభావన చేత విందు వినోదాలలో వస్తువులను పోగొట్టుకోవలసివచ్చుట, తిరిగి స్త్రీ మూలకముగా లభించుట, అనవసరపు మాటలు ఇచ్చుట, ఇతరుల పనులు మీదవేసుకొనుట జరుగును.



# మకర రాశి
## CAPRICORN

ఆదాయం - 08
వ్యయం - 14
రాజ్యపూజ్యం - 04
అవమానం - 05

**ఉత్తరాషాఢ 2,3,4, శ్రవణం 1,2,3,4, ధనిష్ఠ 1,2 పాదాలలో జన్మించినవారు.**
**బో,జా,జి,జూ,జె,జో,ఖ,గా,గీ అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**మకరరాశి వారి లక్షణములు :**

వీరి ముఖ కవళికలు, ఆకర్షనీయముగా ఉన్నప్పటికీ ఎప్పుడూ కోపంగా కన్పిస్తారు. ఆనందంగా ఉండాలన్నా ఉండలేరు, చిరునవ్వు కూడా కనబడదు. ఎవరైన వీరిలోని జింకపిల్లవంటి ఆకర్షనల వలన ముచ్చటపడి ఏ పనినైనా చేసిపెడతారు. వీరికి జాగ్రత్త, గట్టిపట్టు, సూక్ష్మ పరిశీలన, బుద్ధి కుశలత, ఓర్పు, యుక్తి కలిగి ఇష్టమైన విషయాలలో మనస్సుకు నచ్చినట్లుగా ప్రవర్తిస్తారు. తమ తప్పును దాచి, ఎదుటివారిని నిందించుట, ఏ విషయంలోనైనా మొసలి పట్టు పట్టుట మంచి పద్ధతి కాదు. దైవ భక్తి, పూనకాలు వచ్చుట, దయ్యము, గాలి పట్టుట జరుగును. బాల్యమున బాలారిష్ట దోషములు, అనారోగ్య చికాకులు ఉండును. స్థిర ఆస్థి, ఇల్లు, భూ వసతి, గనులు, లాటరీలు, వ్యవసాయం, పల్లె జీవితంలో ఎక్కువ సుఖముండును. చిన్నతనమున తల్లిదండ్రులలో ఒకరికి తీవ్రమైన అనారోగ్యం స్థితి గతులు చెడుట, వారితో విరోదములు, స్థల మార్పులు, ఇబ్బందులు కలుగును. చేరువైన వారి పట్ల ఆప్యాయంగా ఉంటారు. కుటుంబాన్ని నిర్లక్ష్యం చేయరు. డబ్బును సక్రమంగా సద్వినియోగం చేస్తారు. మార్పులేని వృత్తులలో ఉద్యోగాలలో కలిసి వస్తుంది. వ్యాపారంలో బాగా రాణిస్తారు. రైల్వే ఉద్యోగాలలో కాంట్రాక్టర్లుగాను, మిలటరీలోను స్థిరపడతారు. అధికారులకు నమ్మకస్తులై ఉంటారు. ప్రోత్సాహం లేకపోతే నేర్పరితనాన్ని ప్రదర్శిస్తారు. వివాహం యాదృచ్ఛికంగా జరుగును. ఇతర సదుపాయములు, లాభాదులు, వినియోగ దృష్టిని అనుసరించి వివాహం చేసుకొందురు. స్త్రీలకు పురుషులపై వారి ప్రవర్తనపై సందేహములుండును. ఈ మానసిక లక్షణం వలన జీవితంలో వీరు సుఖపడలేరు. స్త్రీలుగాని, పురుషులు గాని వివాహం ఆలస్యంగా చేసుకొందురు. చురుకైన, ఉత్సాహవంతమైన వ్యక్తితో దాంపత్యముండును. పిల్లలు తెలివి కలిగి రాణింతురు. స్త్రీలకు దాంపత్య జీవనమున ఆధిక్యము కలుగుతున్న కొలది పట్టుదలలు విద్వేశములు పెరుగును. నడి వయస్సు తరువాత ఆర్థిక సుఖం పెరుగును. స్త్రీ సంతానం పట్ల ప్రత్యేక అభిమానము ఉండును. చాలా మందికి తండ్రి వలన ఆశించిన మేలు జరుగదు. చంద్ర గ్రహణ సమయాలలో జాగ్రత్తలు అవసరం. ఉత్తరాషాఢ నక్షత్రంయందు జన్మించినవారు వినయం కలిగి సర్వ జనులకు ప్రియమైన వారై అనేక మంది మిత్రులను కలిగి ఉపకార ప్రత్యుప కారాలు చేయుదురు. శ్రవణా నక్షత్రం వారు అన్ని విషయములు తెలిసినవారై ఉదారమైన భార్య కలవారు, ధనవంతులు, శ్రీమంతులు, ప్రఖ్యాతి చెందినవారగుదురు. ధనిష్టా నక్షత్రం వారు, దానశీలురు, సమర్థులు, శూరులు, గానప్రియులు. వీరిఅదృష్ట సంఖ్యలు 1,3,6,7,9, సోమ, బుధ, గురు, శుక్ర వారములు కలసిన మరింత మేలు.

## మకర రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 10,11 స్థానములలో, శని 12వ స్థానములో, రాహువు 7,6 స్థానములలో, కేతువు 1,12 స్థానములలో ఉండుట వలన

ఒక సమస్యతొలగక ముందే మరొక సమస్యతో ఇబ్బందులేర్పడుట, నిలకడ లేని మనస్తత్వములు ఏర్పడుట, అనుకొని ప్రయాణములు చేయవలసి వచ్చుట, దైవ, క్షేత్ర సందర్శనములు చేయుట, దగ్గరి వారి నుండి అశుభ వార్తలు వినుట, దగ్గరి మిత్రలను దూరము చేసుకొనుట, వాహన, గృహోపకరణాదులను కొనుగోలు చేయుట, ఔషధసేవ చేయవలసి వచ్చుట, సంతానము వలన మానసిక చికాకులు ఏర్పడుట, విద్యార్థులు శ్రమచేత ఉన్నత విద్యలను అభ్యసించెదరు. నూతన ఉద్యోగ అవకాశములేర్పడుట, చేయు పనులయందు గుర్తింపులు వచ్చుట మొదలగు మిశ్రమ ఫలితములు కలుగును. ఈ సంవత్సరము ఈ సంవత్సరము **ఈ రాశివారు దుర్గాసప్తశతీ పారాయణములు, సుదర్శన హవనములు, వెన్నదానము చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు అవకతవకలు అధికమగుట, స్థిరాస్థులు కొనుగోలు విషయములో మోసపూరిత చర్యలు జరుగుట, నూతన ప్రయత్నములు ప్రారంభించుట, కొత్త స్నేహములతో లాభములు చేకూరుట, పొత్తు వ్యాపారములు ప్రారంభించుట జరుగును.

**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దూర ప్రాంత ప్రయాణములు చేయవలసి వచ్చుట, కాళ్ళకు సంబంధించిన అనారోగ్యములు ఏర్పడుట, శుభకార్యక్రమ ప్రయత్నములు సఫలమగుట, ధనవ్యయము అధికమగుట, వస్తువులను కొనుగోలు చేయుట, ఆడంబరముగా కనిపించుటకు తహతహలాడుట జరుగును.

**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఏది మాట్లాడిననూ విభేదములు వచ్చుట, పెద్దార్థములతో సఖ్యత లేకపోవుట, గృహముయందు మార్పులు చేయుట, ధనము సరిపడక ఋణములు చేయవలసి వచ్చుట, బుజ్జగింపు వ్యవహారములు చేయవలసి వచ్చుట, దైవ క్షేత్రములను సందర్శించుట, ప్రభుత్వమూలకముగా లాభములేర్పడుట జరుగును.

**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శారీరక శ్రమ అధికమగుట, అకాల భోజనములు, నిద్రలేమితనము వలన అనారోగ్యములు ఏర్పడుట, ఇతరులతో గొప్పగా అనిపించుకొనుటకు ప్రయత్నములు చేయుట, ఇంటియందు అనుకూలత్వము లేకపోయిననూ సంఘముయందు గౌరవ మర్యాదలకై తహతహలాడుట జరుగును.

**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం తొందరపాటు మాటల వలన ఇతరులతో విభేదములేర్పడుట, కోర్టు వ్యవహారములలో చుట్టుకొనుట, శత్రుత్వములు అధికమగుట, ఉద్యోగాదులయందు నిలకడత్వం కోల్పోవలసి వచ్చుట జరుగును.

**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు స్థానచలనములు ఏర్పడుట, ఆరోగ్యపరంగా వైద్యుల సలహా తీసుకోవలసి వచ్చుట, ప్రముఖులను కలుసుకొనుట, మానసిక ప్రశాంతతకై దైవ కార్యక్రమాదులలో, సేవా కార్యక్రమాదులలో పాల్గొనుట, రహస్య మంతనములు చేయుట జరుగును.

**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆకస్మిక ప్రయాణములు ఏర్పడుట, అధిక కోపము చేత పౌరుష వాక్యములు మాట్లాడుట, విభేదములు పెంచుకొనుట, ఆకస్మిక విరోధములు ఏర్పడుట, కార్యక్రమములు మధ్యలోనే ఆగిపోవలసి వచ్చుట, మానసిక సంక్షోభములు ఏర్పడుట, ప్రతిఒక్కరితో ఏదోరకముగా వివాదములు ఏర్పడుట జరుగును.

**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఖర్చులు అధికమగుట, ప్రతిఒక్కరితో అనవసరంగా విరోధములు తెచ్చుకొనుట, సంబంధములేని వ్యవహారములలో కలుగజేసుకొని ఇబ్బందులపాలగుట, సంతానపరమైన ఇబ్బందులు ఏర్పడుట, శారీరక శ్రమ అధికమగుట, దైవకార్యక్రమాలలో పాల్గొనుట జరుగను.

**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆరోగ్యపరమైన ఇబ్బందులు వాటిల్లుట, ప్రతిపని యందు స్థిరమైన అభిప్రాయములు లేకపోవుట, ఆడంబరముగా ఖర్చులు చేయుట. ఋణబాధలు ఉన్ననూ పైకి మాత్రము గాంభీర్యముగా కనిపించుట, వృధాగా కాలయాపన చేయుట, అధికారుల మన్ననలకై వారిని ఏదోరకముగా సంతృప్తిపరుచుట జరుగును.

**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం వాహనపరమైన ఇబ్బందులు వాటిల్లుట, మధ్యవర్తిత్వమును చేయుట వలన ధన నష్టములు, కీర్తి నష్టములు కలుగుట, ఆకస్మిక ధనలాభములు ఉన్ననూ అధికమగు ఖర్చుల వలన ధనము నిల్వ లేకపోవుట, నూతన వ్యక్తులతో చేయు ప్రయత్నములు బెడిసికొట్టుట జరుగును.

**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పొత్తు వ్యాపారములయందు భాగస్వామితో విభేదములు ఏర్పడుట, నీచకార్యక్రమములకు సహకారమందించుట, ఋణము ద్వారా వచ్చిన ధనము చేత స్థిరాస్తులను కొనుగోలు చేయుట, ప్రతిపనియందు ఆటంకములు అధికమగుట, గౌరవ మర్యాదలకు భంగము వాటిల్లుట జరుగును.

**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మధ్యవర్తిత్వము వలన వచ్చిన గడ్డు సమస్యలు సమసిపోవుట, రావల్సిన ధనము సమయానికి చేతికందుట, కోర్టు వ్యవహారము లు తొలగిపోవుట, శుభకార్యక్రమ ప్రయత్నములు లాభించుట, కుటుంబ వ్యక్తులతో కలసి దైవ సందర్శనములు చేయుట, గ్రహశ్శాంతులు చేయించుకొనుట జరుగును.



# కుంభ రాశి
## AQUARIUS

ఆదాయం - 08
వ్యయం - 14
రాజ్యపూజ్యం - 07
అవమానం - 05

**ధనిష్ఠ 3,4, శతభిషం 1,2,3,4, పూ॥భా॥ 1,2,3 వ పాదాలలో జన్మించినవారు.**

**గూ,గే,గో,సా,సి,సు,సే,సో,ద అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**కుంభరాశి వారి లక్షణములు :**

వీరు మంచి తెలివితేటలు, జ్ఞాపకశక్తి, అవగాహన, లోతైన స్వభావం, మంత్ర తంత్రాలు, మానవాతీత శక్తులపై నమ్మకం, గొప్పవారితోను, ధనవంతులతోనూ స్నేహ సంబంధాలు కలిగియుందురు. వ్యాపారముల కొరకు ఇతరముల ద్రవ్యమును అపారముగా కుమ్మరించెదరు. తల్లియందు మంచి ఇష్టము, రెచ్చగొడితె రెచ్చిపోయె బలహీనత, ఆవేశము, ఇబ్బందులకు దారి తీస్తుంది. ఏకపక్ష నిర్ణయాలు, ఇబ్బందులు కల్గిస్తాయి. ఉన్నది ఉన్నట్లుగా చెప్పడం వలన విరోదాలు వస్తాయి. భూసంబంధిత వ్యాపారాలు కలసి వస్తాయి. ఎప్పటికప్పుడు మారే స్వభావం కలిగి ఉంటారు. ప్రేమించగల మనస్సు ఉన్నా ప్రేమాభిమా నాలతో మాట్లాడలేరు. జాతకమునందు కౄర గ్రహముల వక్రదృష్టి ఉన్నా విప్లవాత్మకంగా మార్పు చెందుట, ప్రభుత్వమునకు చట్టమునకు భద్రతకు వ్యతిరేకంగా ప్రజలను సమీకరించుట, ఎవరితో ఉద్దేశాలను అభిప్రాయాలను బయట పెట్టకుండా ఉండుట, చిన్నమాటకు నొచ్చుకొని తట్టుకోలేని కోపం తెచ్చుకొని దుర్భాషలాడుట, ఆహార పానీయాల విషయంలో అనారోగ్యం వాటిల్లుట, ఏ రంగంలోనైనా రాణింపు ఉండుట, ఆస్తి విలువ పెరుగుట వలన ధనవంతులగుతారు. వయస్సు దాటిన తరువాత వివాహం జరుగును. ఒక సన్నివేశంలో తొందరపడి అహంకారిని వివాహమాడి, తరువాత బాధపడ వచ్చును. వరుణ గ్రహమునకు లేక సప్తమ స్థానమునకు కుజ, శనులలో ఒకరి కేంద్ర దృష్టి ఉన్నచో చట్టమునకు, ఆచారమునకు నీతికి విరుద్ధంగా వివాహము చేసుకొందురు. వివాహం తరువాత స్థలము, పరిసరములు, జీవనోపాది మారవచ్చును. స్త్రీ సంతానం పట్ల ఎక్కువ మమకారం ఉండును. సంతానం వల్ల కుటుంబ ప్రతిష్ట ఎలా ఉన్నా స్థితిగతులు బాగుంటాయి. వ్యాపార కూడలి ప్రదేశాలు అద్దెకు ఇవ్వడం వలన అదృష్టాన్ని జారవిడుచుకుంటారు. సరియైన సమయంలో నిర్ణయం తీసుకోని కారణంగా చాలా మంచి అవకాశాలు చేతులదాకా వచ్చి జారిపోతాయి. ధనిష్టా నక్షత్రమున జన్మించినవారు గానప్రియులు, గానాసక్తి, దానశీలత,కలిగి ఉందురు. శతభిషా నక్షత్రము వారు సాహసములు కలవారు, సత్యము పలుకువారై శత్రువులను జయించుదురు. పూర్వాభాద్రా నక్షత్రమువారు మనస్సులో బాధగలవారై ధనవంతులు, సమర్థులు, స్త్రీలచే జయింపబడువారు అగుదురు. ధాతృత్వ గుణము ఉండదు. మాఘమాసంలో జన్మించినవారు సత్యం పలికెదరు. స్నాన దానములయందు ప్రీతి కలిగి ఉందురు. పడమర ఉత్తర దిక్కులు కలసి వచ్చును. వీరి అదృష్ట సంఖ్యలు 3, 4, 5, 8,9, ఆది, సోమ, గురు, శుక్రవారములు కలసి వచ్చును.

### కుంభ రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 9,10 స్థానములలో, శని 11వ స్థానములో, రాహువు 6,5 స్థానములలో, కేతువు 12,11 స్థానములలో ఉండుట వలన

అనారోగ్యములు ఏర్పడుట, శారీరక ఇబ్బందులు అధికమగుట, నరములకు, నేత్రములకు ఇబ్బందులు వాటిల్లుట జరుగును. ఉన్నత ఉద్యోగ అవాకాశాదులు ఏర్పడుట, కీర్తి ప్రతిష్ఠలు పెరుగుట, ఆర్థికముగా ఋణములు అధికమైననూ, మానసిక సంతోషము అభివృద్ధి కలుగుట, గృహమునందు శుభకార్యక్రమములు జరుగుట, గృహనిర్మాణాది పనులు పూర్తియగుట, వెనుకబడిన పనులు పూర్తియగుట, ప్రముఖుల దగ్గర గౌరవ మర్యాదలు పెరుగుట, విద్యార్థులకు ఉన్నత శ్రేణి గుర్తింపులు వచ్చుట, వత్సరాంతమున ధనమునకై ఇబ్బందులు పడుట, ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట, దైవ సందర్శనములు చేయుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు దైవ కళ్యాణముల ను, పాశుపత అభిషేకములను, ముత్తైదువ సామాగ్రి, గుమ్మడిపండ్లను, పసుపురంగు వస్త్రములను దానము చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం గృహనిర్మాణాది ప్రయత్నములు చేయుట, బంధుమిత్రులను కలుసుకొనుట, చేయువృత్తి వ్యాపారాదుల నిమిత్తమై ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట, శారీరక శ్రమ అధికమగుట, భోజన సౌఖ్యము లేకపోవుట, చాలాకాలంగా వెంబడిస్తున్న ఇబ్బందులు తగ్గుముఖం పట్టుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం దైవ కార్యక్రమాదులయందు పాల్గొనుట, ఆశ్రమాదులకు, సేవాసంస్థలకు మీ సహకారమును అందించుట, గౌరవమర్యాదలు పెరుగుట, ప్రముఖుల మన్ననలు పొందుట, శారీరక శ్రమ అధికమగుట వలన కొద్దిగా అనారోగ్యము వాటిల్లుట, మాసాంతమున ఆర్థిక ఇబ్బందులు వచ్చుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తి వ్యాపారాదులయందు అనుకోని మార్పులు ఏర్పడుట, సభలయందు విజయము చేకూరుట, ఇతరుల విషయములను నెత్తిమీద వేసుకొనుట వలన అపవాదులు వచ్చుట, ఆకస్మిక వస్తులాభములు ఏర్పడుట, శుభకార్యక్రమములు సఫలమగుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు పని అధికమగుట, ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట వలన నిద్రలేమితనము అకాల భోజనములు చేయవలసివచ్చుట, ప్రభుత్వ సంబంధిత కార్యక్రమాదులయందు విజయం చేకూరుట, ఆభరణములను పోగొట్టుకొని తిరిగి సంపాదించుకొనుట జరుగును.
**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శారీరక శ్రమ అధికమగుట వలన అనారోగ్య భయములు అధికమగుట, ఔషదసేవ చేయవలసి వచ్చుట, ఆదాయమును మించి ఖర్చులు అధికమగుట, ఋణములు చేయవలసి వచ్చుట, మిత్రులతో విభేదములు ఏర్పడుట, ఆకస్మిక కలహములు అధికమగుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆడంబరమగు వస్తువులను కొనుగోలు చేయుట, తద్వారా ధనవ్యయము జరుగుట, ఋణములు చేయవలసి వచ్చుట, ప్రతి పనియందు ఆసక్తి తగ్గుట, అలసట, అనాలోచిత నిర్ణయములు అధికమగుట, తొందరపాటు తనముతో కలహములు పెంచుకొనుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పొత్తు వ్యాపారాదులయందు మోసపోవలసి వచ్చుట, ఎదుటివారితో మాటలుపడవలసి వచ్చుట, దైవ కార్యక్రమాదులయందు పాల్గొనుట, గ్రహశాంతులు, అభిషేకాదులు చేయించుట కిందివారిపై చులకనభావములు ఏర్పడుట, అధికులను చూసిన ద్వేషభావము అధికమగుట జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మాటపట్టింపులు అధికమగుట, మనసంతృప్తి లేకపోవుట, చంచల స్వభావముతో పనులన్నింటిని చేయకపోవుట, ఇతరులతో మాటలు పడవలసి వచ్చుట, ఆరోగ్యపరమైన సమస్యలు కొద్దిగా తగ్గుముఖం పట్టుట, నూతన వ్యాపార ప్రయత్నములకై సమయము కేటాయించుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం బంధుమిత్రులను కలుసుకొనుట, విందువినోదాలలో వస్తువులను పోగొట్టుకొనుట, అనవసరముగా కలహములు అధికమగుట, మాసాంతమున బంధువర్గం సహకారముతో అనుకూలత్వము ఏర్పడుట, సమయానికి ఋణసహాయములు అందుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయువృత్తి వ్యాపారాదులయందు మెల్లమెల్లగా ఆసక్తి పెరుగుట, ప్రముఖులను కలుసుకొనుట, వాహనపరమైన ఇబ్బందులు ఎదుర్కొనుట, శత్రు సంబంధితమైన అంశములు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టి మిత్రత్వములు ఏర్పడుట, కుటుంబ సఖ్యత ఏర్పడుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు ఆకస్మిక ధనలాభములు ఏర్పడుట, పొత్తు వ్యాపారాదులయందు అధికముగా ధనము ఇవ్వవలసి వచ్చుట, ఋణ బాధలు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, స్థిరాస్తుల నిమిత్తమై కలహములు ఏర్పడుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం గౌరవమర్యాదలు పెరుగుట, నేత్ర సంబంధ, కర్ణ సంబంధమైన అనారోగ్యములు వాటిల్లుట, వైద్యుల సలహా తీసుకోవలసి వచ్చుట, చేయు వృత్తివ్యాపారాదులయందు అనుకూలంగా ఉన్ననూ ఆత్మ సంతృప్తి లేకపోవుట, ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట జరుగును.



# మీన రాశి
# PISCES

ఆదాయం - 05
వ్యయం - 05
రాజ్యపూజ్యం - 03
అవమానం - 01

పూ॥భా॥ 4, ఉ॥భా॥ 1,2,3,4, రేవతి 1,2,3,4 పాదాలలో జన్మించినవారు.
ది,దు,శం,ఝ,థ,దే,దో,చా,చీ అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు

**మీనరాశి వారి లక్షణములు :**

వీరు సౌమ్యులు, ఏకాగ్రత, ప్రశాంతత కలిగిన మనస్కులై, దైవభక్తి, తెలివితేటలు, సంభాషణా చాతుర్యం కలిగి అసమాన ప్రతిభను ప్రదర్శించగలరు. వీరిది మృదు స్వభావం, వస్త్రములందు మక్కువ, ప్రేమాభిమానాలు, మనోభావాలు వ్యక్తం చేయడం కాకుండా దాచుకోవడం, ఇతరులను దగ్గరకు రానివ్వకపోవడం వలన కలసి రాదు. చూపులతో మనష్యులను ఆకట్టుకుంటారు. చిన్న మాటకే బాధపడతారు. కోపం, ఆగ్రహం నిరాశను కల్గిస్తాయి. అనుమానాలు, భయాల కారణంగా స్వంత వ్యాపారాది వృత్తులలో అనేక అడ్డంకులు తెచ్చుకొని బాధపడతారు.ప్రజోపయోగకరములైన నిర్మాణములు, కట్టడములు, ఉద్యోగములో భాగస్వామ్య వ్యాపారాలలో బాగా రాణిస్తారు. ప్రేమాభిమానాలు కొంత మనోధైర్యాన్నిస్తాయి. కుటుంబ వాతావరణానికి ఎటువంటి మనస్థాపం కలగకుండా ఆనందమయంగా ఉంచుకోవడానికి ప్రయత్నిస్తారు. జలసంబంధిత వ్యవహారాలు కలసి వస్తాయి. ఉదక మందు ఉత్పన్నమైన వాటి వలన వచ్చు ధనము అనుభవింతురు. భూములు ఎట్టి పరిస్థితిలోనూ తనఖాగాని, అమ్ముటగాని చేయకూడదు. భద్రత, ఆరోగ్య విషయాలలో జాగ్రత్త అవసరము. బాల్యమందు కష్టాలు, గండములు కలవు. బంధుమిత్రాదులలో ఎవరికో ఒకరికి సేవ చేయుటగాని, రోగులపై దక్షత వహించుటగాని జరుగవచ్చును. చెడ్డమార్గం నుండి మంచికో లేక మంచి నుండి చెడ్డకో ఆశ్చర్యకరంగా ఒక్కరోజులో మారిపోగలరు. భార్య వలన గాని మిత్రుల వలన గాని అకారణముగా తల్లిదండ్రులకు, తోబుట్టువులకు దూరంగా ఉండవలసి వచ్చును. సోదరులతో స్వల్ప సంబంధములు మాత్రము ఉండును. బంధువులతో కన్నా స్నేహితులతో సన్నిహితంగా ఉంటారు. విలాసవంతమైన జీవితం గడుపుతారు. కుటుంబ సభ్యులకు అన్ని విధాలుగా ఆనందమును, సౌఖ్యమును చేకూర్చగలరు. నడి వయస్సు తరువాత మీ జీవితంలో ప్రవేశించిన స్త్రీ వలన ఇబ్బందులు కలుగును. ఈ రాశిలో జన్మించిన స్త్రీలు ఇల్లు దిద్దుకొనుటలో, ఉదాత్తమైన జీవితమును గడుపుటలో చక్కని మాతృమూర్తులై సంతానమును పెంచి పెద్దచేయగలిగి ఉందురు. పనులు చేయుటలో తొందర, కంగారు వలన అలసి నీరసించిపోయెదరు. ప్రేమ విషయంలో తొందరపాటు మంచిదికాదు. రుచికరమైన పదార్థాలను వండి తినిపించేవారిని, ఇంటిని చక్కగా అలంకరించేవారిని ఇష్టపడతారు. వీరిని బుజ్జగిస్తుండాలి. పూర్వాభాద్రా నక్షత్రమున జన్మించినవారు మనస్సులో బాధను ఇతరులకు చెప్పరు. ఉత్తరాభాద్రా నక్షత్రము వారు మాట్లాడుటలో నిపుణత కలిగి సుఖవంతులై సంతానాభివృద్ధి చెంది ఉందురు. రేవతి నక్షత్రము వారు అవయవ సౌష్టవం కలిగి అందరికి ఇష్టులై, శూరులు, ధనవంతులు, ఇతరుల ధనద్రవ్యములు కోరనివారగుదురు.

## మీన రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 8,9 స్థానములలో, శని 10వ స్థానములో, రాహువు 5,4 స్థానములలో, కేతువు 11,10 స్థానములలో ఉండుట వలన

శుభ కార్యక్రమాదుల యందు ప్రముఖుల పాత్ర వహించుట, ఆకస్మిక ప్రయాణములు, వాహన పరమైన ఇబ్బందులు ఏర్పడుట, చేయు వృత్తి వ్యాపారాదులలో మార్పులు చేయుట, గౌరవమర్యాదలు తగ్గుముఖం పట్టుట, బంధుమిత్రులతో వైరములు వచ్చుట, అనారోగ్య ఇబ్బందులు వాటిల్లుట, ఉద్యోగాదుల యందు మార్పులు ఏర్పడుట, అధికారులతో విభేదములు వచ్చుట, అందరికి దోషుల వలే కనిపించుట, గౌరవ మర్యాదలకై ధనము వ్యయము చేయుట, మానసిక చికాకులు అధికమగుట, సంతానము వలన ఇబ్బందులు వాటిల్లుట, విద్యార్థులకు మిశ్రమ ఫలితములు వచ్చుట, దూరప్రయాణములు చేయవలసి వచ్చుట, శుభమూలక ధనయోగములు ఏర్పడుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు దుర్గా సంబంధమైన ఆరాధనలు చేయుట, కంచుపాత్రలో మినుములు దానము చేయుట, సౌరహోమములు చేయుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు ఆకస్మిక ధనలాభములు ఏర్పడుట, దంత సంబంధిత అనారోగ్యములు ఏర్పడుట, గౌరవ మర్యాదలు పెరుగుట, గడ్డు సమస్యలు సమసిపోవుట, ప్రముఖులను కలుసుకొనుట, నూతన వ్యాపార ప్రయత్నములు లాభించుట జరుగును.

**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభ కార్యక్రమములు సఫలమగుట, చేయు పనులయందు శ్రమ అధికమగుట, నూతన వస్తు, వాహన, ఆభరణాదులను కొనుగోలు చేయుట, బంధుమిత్రులతో కలసి వినోద కార్యక్రమములో పాలుపంచుకొనుట, ఔషదసేవ చేయవలసి వచ్చుట, రక్త, దంత సంబంధమైన ఇబ్బందులు ఏర్పడుట జరుగును.

**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట, దైవ క్షేత్రములను సందర్శించుట, కుటుంబమందు శుభకార్యక్రమ ప్రయత్నములు సఫలమగుట, యాగాదులయందు పాల్గొనుట, ధనవ్యయము అధికమగుట, సమయానికి ఋణములుచేతికందుట, ఉదరసంబంధమైన ఇబ్బందులు వాటిల్లుట జరుగును.

**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చిరకాల మిత్రులను కలుసుకొనుట, కుటుంబ వ్యక్తులతో కలసి శుభమూలక కార్యక్రమములు చేపట్టుట, విందువినోదాలలో పాల్గొనుట, ఆర్థికపరమైన అవరోధములు తొలగించుకొనుటకు ప్రయత్నములు సాగించుట ఏదోరకముగా ధనము చేతికందుట జరుగును.

**అగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అనుకోని ఖర్చులు ఏర్పడుట, ఆకస్మిక బంధుజనుల రాకలు ఏర్పడుట, కుటుంబమందు సంతోషకరమైన వాతావరణములు ఏర్పడుట, గౌరవమర్యాదులు పెరుగుట, మాసాంతమున ఆర్థిక ఇబ్బందులు కలగును.

**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు అనుకూలత్వం సన్నగిల్లుట, ప్రతిపనికి ఇతరుల సహాయం అర్థించవలసివచ్చుట, ఋణప్రయత్నములు సఫలమగుట, దూర ప్రయాణములు చేయవలసి వచ్చుట, మాసాంతమున ధనలాభములు ఏర్పడుట జరుగును.

**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అనుకొని ప్రయాణములు చేయవలసి వచ్చుట, కుటుంబ వ్యక్తులతో స్వల్పముగా కలహములు ఏర్పడుట, గృహోపకరణములు కొనుగోలు చేయుట, ప్రముఖులను కలుసుకొనుట, నూతన వ్యక్తులతో పరిచయములు ఏర్పడుట, నూతన కార్యక్రమములు సఫలమగుట జరుగును.

**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మానసిక చికాకులు అధికమగుట, ప్రతిపనియందు ఆసక్తి లేకపోవుట, అయిష్టముగానైననూ కుటుంబవ్యక్తుల కోసం విందువినోదాలలో పాల్గొనుట, ఆరోగ్యపరమైన ఇబ్బందులు వాటిల్లుట, అకాల భోజనములు చేయవలసి వచ్చుట జరుగును.

**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు స్వల్పముగా ధనలాభములు ఏర్పడుట, గౌరవమర్యాదలు పెరుగుట, రావలసిన బకాయిలు సమయానికి చేతికందుట, సంతానముతో కలసి విహారయాత్రలకు వెళ్లవలసి వచ్చుట, స్త్రీమూలక ధనవ్యయము అధికమగుట జరుగును.

**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆకస్మిక ప్రయాణములు తద్వార అనారోగ్యములు వాటిల్లుట, సంఘములో గౌరవ మర్యాదలు పెరుగుట, ప్రముఖ సభలయందు ముఖ్యస్థానము వహించవలసి వచ్చుట, ఆర్థికపరంగా ఒడిదుడుకులు అధికమగుట, ఋణప్రయత్నములు చేయవలసి వచ్చుట జరుగును.

**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభ కార్యక్రమ ప్రయత్నములు ప్రారంభించుట, ఆర్థిక పరిస్థితి మెల్లమెల్లగా అభివృద్ధి పొందుట, మానసిక ప్రశాంతత చేకూరుట, ధనవ్యయము అధికమైననూ ఏదోరకముగా సమయానికి ధనము చేతికందుట, శుభకార్యక్రమ ప్రయత్నములు సంపూర్ణమగుట జరుగును.

**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వ్యక్తులతో పరిచయములు ఏర్పడుట, జంతు సంబంధ ఇబ్బందులు, రోగ సంబంధ ఇబ్బందులు వాటిల్లుట, తొందరపాటు నిర్ణయముల వలన ధన నష్టము వాటిల్లుట, నేత్ర సంబంధమైన అనారోగ్యములు వాటిల్లుట, ఔషధసేవ చేయవలసి వచ్చుట జరుగును.

